Photo by Harish M. Shah



బహుమతి
పొందిన వ్యాఖ్య

దినదిన గండం

పంపినవారు :
ఎ. ఎస్. ఎన్. మూర్తి - కాకినాడ

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ,
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


చందమామ (అన్ని భాషలలో)
విడి కాపీ 50 నయా పైసాలు. (8 అణాలు)
సాలు చందా రు 6 లు.

టెలిఫోన్ : 5332

# పి. ఎమ్. ఆర్. అండ్ కంపెనీ,

హెడ్డ్ ఆఫీసు :

## 313, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1

బ్రాంచి : 27/14, హై రోడ్డు, చిత్తూరు.



★

ఆల్విన్ అండ్ ఫోల్డ్‌డీలక్సు ఉక్కు ఫర్నీచర్లు, ఆస్బెస్టోస్ సిమెంటు షీట్లు, ఏ. సి. పైపులు, ఫిట్టింగుల డీలర్లు.

★

చెంగల్పట్టుజిల్లాకు కూడా ఆల్విన్ అండ్ ఫోల్డ్‌లక్స్ ఉక్కుఫర్నిచరు డీలర్సు


ధైర్యశాలి
రాము,
డంబాల
రంగా


ఆహోహో ఆమామిడి పళ్లను చూడు! అవి నానోరూరిస్తున్నాయి!


రంగా, రంగా, నీవు శుద్ధ అబద్ధాల కోరువు, నేనె-రుగుదును, నీవు దొంగవు కూడానేమో! రూఢిగా నేనెరుగను
నీవు వట్టి పిరికి పందవు !


పారిపో రంగా, నీ ప్రాణం దక్కించుకో; లేదా నీవు మహా చిక్కుల పాలౌతావు!

DL. 324A-50 TL


నీ వొల్లు కాపాడుకో! నే నెవ్వరికీ భయపడను!


ఓ, మిత్రమా! ఈ అవంతరం నుంచి తప్పించుకొనే ఉపాయం లేదు!


తోటమాలీ! నేను మామిడి పళ్లను లెక్కపెట్టుచున్నాను, అంతే! వాటిని నేను తెంపుటలేదు!


ఇదుగో! నేను ప్రమాణం చేస్తున్నాను; నా యీ మామిడి పళ్లను య్యళ్లు ఎప్పటికీ ముట్టుకోను!


హుం! పరిగెత్తడం వల్ల నాకు ఊపిరాడటం లేదు!
సహజంగా అంతే! నీవు వట్టి బలహీనుడవు! నన్ను చూడు! నేను రోజూ పాలు త్రాగుతాను; నేను 'డాల్డా'తో వండ-బడిన ఆహారం భుజించుతాను. అందు చేతనే నేను నీకంటే ఎక్కువ బలంగా వున్నాను.


డాల్డా'తో వండబడిన ఆహారము మీకు బల-మును శక్తిని గలిగిం-చును అది చాలా సుల-భంగా జీర్ణ మగును! మనలను ఆరోగ్యవం-తంగా నుంచుటకు అవసరమైనట్టి ఎ,డి, విటమిన్‌లు 'డాల్డా'లో చేర్చ బడియున్నవి.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

తాను తప్పు దోవను పోతున్నానని తెలుసుకుని తన జీవితాన్ని మంచి మార్గానికి తిప్ప దలుచుకున్నవాడు వెంటనే అలా మారనిపక్షంలో తరవాత ఎన్నటికో మారుతాడనేది కల్ల. "తప్పి పోయిన మోక్షం" [బేతాళ కథ]లో రత్నపాలుడనే రాజు యాభై సంవత్సరాల వ్యవధి ఉంచుకునికూడా తన మనసును భగవంతుడికేసి తిప్పలేక పోతాడు. జీవితంలో నిజమైన పరివర్తన కలిగినప్పుడే మనిషి పరిణామం చెంద గలడని ఈ కథ రుజువుచేస్తోంది.

సంపుటి 22 మే 1958 సంచిక 5



# అట్టివిూదిబొమ్మ

అభిమన్యుడికీ ఉత్తరకూ వివాహం ముగియగానే పెళ్ళికి వచ్చిన పెద్దలూ, పిన్నలూ విరాటరాజు సభాభవనంలో సమావేశమయారు. విరాటుడూ, ద్రుపదుడూ, వాసుదేవుడూ మొదలుగాగల పెద్దలు మధ్య కూర్చున్నారు. ఒక పక్కగా పాండవులూ, కృష్ణుడూ, బలరాముడూ, సాత్యకీ మొదలైనవారు కూచున్నారు.

కొంతసేపు ఇష్టాగోష్ఠి నడిచాక కృష్ణుడు లేచి, "పాండవులు కపట జూదంలో తమ రాజ్యాన్ని పోగొట్టుకుని పన్నెండేళ్ళు అరణ్యవాసమూ, ఒక ఏడు అజ్ఞాతవాసమూ అనుభవించారు. ఇప్పుడు వారిరాజ్యం వారికి తిరిగి రావలిసి ఉన్నది. అటు కౌరవులకూ, ఇటు పాండవులకూ నష్టం జరగకుండా ధర్మ సమ్మతంగా పని జరిగే ఉపాయం ఆలోచించండి. దుర్యోధనుడు పాండవులకు రాజ్యంలో సగభాగం ఇవ్వకపోతే యుద్ధం జరుగుతుంది, అందులో కౌరవులు అకారణంగా చనిపోతారు," అన్నాడు.

వెంటనే బలరాముడు లేచి, "అవును, యుద్ధం జరగకుండా పాండవులకు రాజ్యం రావాలంటే మనం దుర్యోధనుడి వద్దకు ఒక దూతను పంపాలి. ఆ దూత ధృతరాష్ట్ర శకుని దుర్యోధనాదులతో అతి వినయంగా మాట్లాడి, వారి అనుగ్రహం సంపాదించి పాండవులకు వారి రాజ్యాన్ని రాబట్టాలి," అన్నాడు.

ఈ మాటలు విని సాత్యకి మండిపడి, "పాండవుల దూత వెళ్ళి కౌరవులకు సాష్టాంగపడవలసిన అవసరంలేదు. ధర్మరాజుకు కౌరవులు అర్థరాజ్యం ఇవ్వనిపక్షంలో మేమంతా కలిసి యుద్ధంలో వారిని సర్వనాశనం చెయ్యగలం!" అన్నాడు. వృద్ధుడైన ద్రుపదుడు సాత్యకినే బలపరిచాడు. "నా పురోహితుడు ధృతరాష్ట్ర భీష్మ ద్రోణులను బాగాఎరిగినవాడు. అతనిని దూతగా పంపుదాము. అంతేకాదు, ధర్మరాజు ముందుగానే నానాదేశాలకు మనుషులను పంపి, యుద్ధం జరిగే పక్షంలో తన పక్షాన పోరాడమని విజ్ఞప్తి చేయటం మంచిది," అని సలహా ఇచ్చాడు. కృష్ణుడు ఈ సలహాను బలపరిచాడు.

తరవాత కృష్ణుడు మొదలైన వారు తమ ఇళ్ళకు బయలుదేరి పోయారు. సభలో పాల్గొన్న రాజులందరూ యుద్ధప్రయత్నాలు సాగించారు. ద్రుపదుడు తన పురోహితుడికి చెప్పవలసిన విషయాలన్నీ చెప్పి ధృతరాష్ట్రుడి వద్దకు రాయబారం పంపాడు.




తెలతెల్లవార సో-మిలకుడు లేచి
తిలకింపగా నొక్క - దృశ్యమ్ము తోచె
గుప్తధనుండేమొ - గొణుగుచు నుండె
తప్తచిత్తమున ను-త్తలపడుచుండె
రేయెల్ల నతిసార - మాయన వేచె
నే యని భోజన - మ్మాయన విడిచె.
ఒకపూట అన్నమ్ము - నొసగెను గనుక
ఒకపూట తన తిండి - సకలమ్ము విడిచె.
ఇది చూచి మరునాడు - గదిసెను సాలె
కుదురుగా భుక్తార్థ - సదనమ్ము జూచి.
అతనెంతొ సంతోష - మంది ఆదరము
జతచేసి అతిథ్య-సత్కృతుల్ సేసె.
స్నానమ్ము సేసి రు-చ్యముల భుజించి
మానిత శయ్యపై - బ్రమాగన్ను వేసె.

*　　*　　*

కలలోన మామూలు - పలుకులు వినియె
చలియింపకయె వాని - సారమ్ము గనియె

కర్మ :

ఓ కర్త పాప మీ-యోగ్యుడు గేస్తు
శాకపాకములకై - చాల వెచ్చించె
మరునాడు వెచ్చమ్ము మఱి - కూర్చవలయు
సరిజేయు భారమ్ము - సర్వము నీదె.

*　　*　　*

తెలతెల్లవారె సో-మిలకుడు లేచి
తిలకించె ; నెవ్వరో - గలగలమంచు
రూకల గొనివచ్చి - రొక్కమ్ము నిచ్చి
ఏకార్యమోగాని - ఏగిరవ్వారు.
అపుడు వా డనుకొనె - అవసరమ్ములకు
జప మొనరింపక - చాలిన ధనము
చేకుఱ చాలదా ? - చెంబెడు కూడ
లేకుండ లో దాచ - నేమిటి వచ్చు
దాచినదేమి లే-దా మఱి యితను
ఏ చింతలేక వ్య-యించు సాధించు.
పాపమా గుప్తధ-నాపశదుండు

విద్వాన్ విశ్వం





తమ మిత్రుగా నెంచి - ధైర్యమ్ము చెప్పె
విమల మనస్కమా - విబుధ వర్గమ్ము.
కాకి వేవేగ తె-క్కలు విచ్చివెళ్ళి
ఆకాశమున చూచి - ఆ బోయలెల్ల
పోయినారని చెప్పె - పోయె పీడనుచు
ఆయాస ముడిగి వా-రందఱు చనిరి.
పగటివేళ నొకప్డు - పరిపాటి గనుక
నగపాళి పొంత వా - రొగి చేరినారు
జింక రాలేదని - చింతిల్లినారు
శంకించి కాకి ఆ-చాయల చూచె
వలలోన చిక్కచిం-తిలు జింక మిత్రు
తిలకించి కన్నీరు - తొలకించి అనియె.
"అవసాన కాల మి-య్యది సెలవన్న
అవతలి మిత్రుల - నడిగితి నన్న-"
అది విని వాయస - మ్మగలకు మంచు
కదిలి మూషికము తె-క్కల మోసి తెచ్చె.
ఇంత యెఱింగి నీ - వెటు వలబడితి
వింత యటన్న ఆ-మృగ మిట్టులనియె
"కర్మానుసారమ్ము - కల మతి గూడ
మర్మ మెఱుంగక - మాయుమౌ సుమ్ము"
ఇంతలో వాయస - మ్మిట్లని పలికె
మంత నాలాడుచు - మన ముండరాదు.
కట్లు విప్పిన జింక - గంతుచు వోవు
చెట్లపై కెగిరి నే - చెచ్చెఱ వోదు
ఎలుకయు కలుగులో - బిలబిల దూఱు
సావడలే డెంత - దాపున్న నేమి?
అనుకొని ఆ సాలె - అరిగెను పురికి
తిను దానితోనె - సంతృప్తితో నుండె

* * *

అని మంథరకము తా - వినిచి ఆ కథను
మనసున చింతింప - కనె నెల్కతోడ.
ఆ మాట నిజమని - ఆ కాకి యనియె
ఆ మాట నీమాట - నటు వారు దినము
సంతసమ్మున జేరి - సరసు దాపునను
ఎంతొ హాయిగనుండి - రెన్ని దినాలొ.
ఒకనాడు బోయ త - న్నొడిసి పట్టంగ
వికలమై ఒక జింక - వేవచ్చె నటకు.
అది చూచి దాని భ-యమ్మును గాంచి
గదిసి వారలు వాని - కథ యెల్ల దెలిసి,

కలత తాబేలుకే-కద బోయ రాగ.
అనుచుండగనె బోయ - అట చనుదెంచె
తన త్రాళ్ళు ఎలుక త్రెం-చిన జింక పోయె-
కాకి మూషికము చ-క్కగ తప్పుకొనిరి.
ఏకాకి యైపోయె - నింక కూర్మమ్ము.
తాబేలు బోయ చే-తం బడిపోయె.
ఆ బోయ దాని చే-యందుక అరిగె.
అత్తఱి మిత్రుని - అగచాట్లు దలచి
చిత్తమ్ము కలగి ఆ-స్నేహితుల్ చేరి
యోచించి చేసిరి - ఒక యుపాయమ్ము.
ఆ చిటి జింక గ-తాసువు వోలె
దారిలో బడిపోయె - తను కాకి వాని
ఊరక పొడుచుచు-నుండె, నాబోయ
ఇది చూచి బోయ వా - డిది చచ్చెననుచు
మదిపొంగి తాబేలు - మఱి పడవేసి
జింకకై పరువెత్తె; - చెంగున నెగిరె
జింక, కాకియు పోయె; - చిక్కెలు కేమొ
పటపట తాబేలు - పట్టుక యున్న
చిటిగడ్డి పోచల - ఛిన్నమ్ము చేసె
కూర్మమ్ము బిరబిర - గుంటలో దుమికె.
కర్మమ్మిది యటంచు - కలగె నా బోయ.
ఆ బోయ చింతించి - ఆకలితోడ
దేబెయై యింటికి - తిరిగి చనంగ
మెల్లగా మిత్రులు - మిగుల సంతసము
నుల్లాసమును మీఱ - నొకచోట చేరి
తమ సరస్తీరమ్ము - దఱిసిరి వేగ
కమనీయ భూముల - కలతల వీడి
మునుపున్న యట్లె స-మ్మోదమ్ముతోడ
తనిసి కాలక్షేప-మును సేయ గనిరి.
అందుకే నరులు స్నే-హము సేయవలయు
అందుకే మంచి మి-త్రాళి కావలయు.
నేస్తమెప్పుడు జీవ-నియతికి మేలు
నేస్తులే మనకున్న-ఆస్తి పాస్తులును.
మనసిచ్చి మిత్రుల - తను గూర్చుకొన్న
జనుడెప్పు డవమాన-మును చెందబోడు.

* మిత్రసంప్రాప్తి సమాప్తం. *





# గడుసుపెళ్లాం

ఒక ఊళ్ళో ఒక సంసారి ఉండేవాడు. అతను పెళ్లి చేసుకున్న మనిషి చాలా గడుసుది. మొగుడు మెత్తనివాడు కావటంతో ఆమె మరింత కొరకరాని కొయ్య అయింది.

భార్య కాపరానికి వచ్చిన కొత్తలో భర్త అచ్చుగా మగపనులే చేసేవాడు. కాని రాను రాను ఆడపనులుకూడా ఒక్కొక్కటే అతనిపైన పడసాగాయి. అతని భార్య పొలం పనిలో ఆవగింజంత అయినా సహాయపడక పోగా ఇంటిపనులుకూడా అతనికే అంటగట్టింది. ఆవులనూ అతనే చూడాలి. మేకలనూ అతనే చూడాలి. చివరకు నీరు తేవటమూ, కసువు ఊడ్చటమూ, బట్టలు ఉతకటమూ, పొయి రాజెయ్యటమూకూడా అతనిపైనే పడ్డాయి.

ఇంత కష్టపడి అడ్డమైనచాకిరీ చేస్తున్నా అతని భార్య అతన్ని రోజల్లా దుమ్మెత్తిపోస్తూనే ఉండేది; అతను చేసిన పనికీ, చేయని పనికీ తప్పు పట్టేది. భార్య పెట్టే శాపనార్థాలు వినటానికిగాను కాస్సేపు నిలబడటానికైనా అతనికి తీరిక ఉండేదికాదు. అందుచేత, అతను పనులమీద అటూ ఇటూ తిరుగుతూంటే భార్య ఒకచోట నిలబడి, అతనికి వినపడేలాగ గొంతెత్తి, "నీకు ఒక్కపనీ చేతగాదు! ఏది ముందు చెయ్యాలో ఏది వెనక చెయ్యాలో తెలీదు! ఇంత చేతగాని మొగుడితో నేనెట్లా కాపరం చేసేదంట!" అని చుట్టుపక్కల మైలుదూరం వినపడేటట్టు కేకలుపెట్టేది.

భార్య ఇంత చేస్తున్నా ఆ మానవుడు నోరెత్తక అన్నీ పడేవాడు. అతనికి అటువంటి భార్యతో ఘర్షణపడటం ఎంతమాత్రం ఇష్టంలేదు. అందరూ తనని చూసి నవ్వుకుంటున్నారని అతనికి తెలుసు. అతను తన మిత్రులతో, "ఎందుకు నవ్వుతారు? నవ్విన నాపచేనే పండుతుంది!" అనేవాడు.

ఎస్. గోపాలరావు



ఒక రోజు భార్య భర్తతో, "పాలు కాస్తా విరిగాయి! నువ్వే పని సరిగ్గా చేశావు గనక ?" అన్నది నిష్ఠురంగా.

భర్త ఆశ్చర్యంతో, "పాలు విరగటం కూడా నా తప్పే ?" అన్నాడు.

"పాలదుత్తను నువు పీచుపెట్టి తోమి ఉంటే పాలెందుకు విరుగుతాయీ ?" అన్నది భార్య.

"ఇదుగో, చూడూ! పాలదుత్త దగ్గిర్నుంచీ నేనే తోమాలని నాకు తెలీదు. ఇప్పుడే నువు చెబుతున్నావు," అన్నాడు భర్త.

"ఎన్ని పనులని నేనే చూసుకునేది. మగదిక్కంటూ ఉన్నందుకు నాకు నీ సహాయం ఉండక్కర్లేదా ఏమిటి ?" అన్నది భార్య.

"అదంతా నాకు తెలియదు. నేను చెయ్యవలసిన పనులు ఏమేమిటో ఒక జాబితా రాసి ఇయ్యి! అవి చెయ్యకపోతే తప్పు పట్టు! ఇది నోటిమాటలతో తేలే వ్యవహారం కాదు," అన్నాడు భర్త.

అతను కాగితంమీద రాసుకుంటూంటే భార్య అతను చేయవలసిన పనులన్నీ చెప్పింది. అది కొండవీటి చాంతాడంత జాబితా అయింది.

కొద్దిరోజులు గడిచాయి. సంక్రాంతి వచ్చింది. రేపు పండగ అనగా భార్య తమ



ఇంటి సమీపాన ఉన్న నీళ్ళగుంట దగ్గిర చాకిరేవు పెట్టింది. భర్త బట్టలు ఉతికి, పిండి, అందిస్తూంటే భార్య వాటిని ఆరవేస్తున్నది. ఈ పని చేస్తున్నంత సేపూ ఆమె భర్తను తిడుతూనే ఉన్నది : "రేపే పండగ! మామూలు పనులే కాలేదు. ఇక పండగ పనులు ఏమవుతాయో! జాబితా రాసుకున్నావు, ఏం ప్రయోజనం? చాలామంది వాజలున్నారు గాని, నీ అంత పనికిమాలిన వాజను నేనెక్కడా చూడలేదు. మా అమ్మ ఏనాడో చెప్పింది—"

ఆమె మాట పూర్తి చెయ్యకముందే ప్రమాదం జరిగిపోయింది. ఆమె భర్త

పిండిన బట్టను అందుకోవటానికి గుంట ఒడ్డున ఉన్న జారుడురాయిమీద కాలు పెట్టింది. మొగుణ్ణి తిట్టే ఉద్రేకంలో ఆమె ఆ రాయిని సరిగా చూడలేదు. దానిమీద కాలుపెట్టిన మరుక్షణమే కాలు జారి దభీమని నీళ్ళగుంటలో పడిపోయింది.

"మునిగిపోతున్నాను! చచ్చిపోతున్నాను! వేగిరం పైకి లాగు!" అన్నది భార్య.

"మునిగిపోవులే. గుంట అటే లోతులేదు. నీ మెడ వరకే నీరున్నది!" అన్నాడు భర్త.

"చలికి ఒళ్ళంతా బిగుసుకుపోతున్నది! వేగిరం నన్ను పైకి తియ్యి!" అన్నది భార్య చలికి వణుకుతూ.

"అదెట్లా? జాబితాలో నేను చెయ్యవలసిన పనులు చాలా ఉన్నాయి. ఇది జాబితాలో లేని పని!" అన్నాడు భర్త.

"నన్ను ముందు పైకి తీస్తావా, తియ్యవా? అమ్మయ్యో, జలగలు!" అని భార్య చావుకేక పెట్టింది.

"మనం చేసుకున్న ఏర్పాటు అప్పుడే మరిచినట్టున్నావు. కావలిస్తే ఇంటికి పోయి జాబితా తెచ్చి వినిపిస్తానుండు!" అంటూ భర్త జాబితా తెచ్చి చదవసాగాడు.

భార్య చలితోనూ, జలగల భయంతోను వణికిపోతూ హీనస్వరంతో, "చచ్చిపోతున్నాను, ఆ జాబితా చించిపారేసి నన్ను దబ్బున బయటికి తీద్దూ, నీకు పుణ్యముంటుందీ!" అన్నది.

"ఆ మాట అన్నావు, బాగుంది! ఈ జాబితాతో ఇక మనకు పనిలేదు. ఇకనుంచీ నువు ఆడపనులు చెయ్యి, నేను మగపనులు చేస్తాను! అందుకు సమ్మతమేనా?" అన్నాడు భర్త.

భార్య సరేనన్నది. భర్త ఆమెను గుంటలో నుంచి బయటికి లాగి ఇంట్లోకి తీసుకుపోయి చలిమంట వేశాడు. ఆ తరవాత భార్య అతన్ని ఎన్నడూ పల్లెత్తుమాట అనలేదు, తన పనులు అతనికి చెప్పలేదుకూడా.






## 17

[పద్మపాదుడు పింగళుడికి ఎడారిదొంగలు బిడారు వర్తకులను బంధించిన గుహ చూపించాడు. హసన్‌గోరీ సైనికులతో వెళ్ళి, వర్తకులను విడిపించాడు. తరవాత, పింగళుడు కోరగా పద్మపాదుడు తన మంత్రశక్తివల్ల, తోడేళ్ళనూ, పెద్దపులులనూ సృష్టించి, వాటితో ఎడారి దొంగలను చుట్టుముట్టించి, తాను వున్నచోటుకు వాళ్ళను రప్పించాడు. తరవాత—]

ప్రాణభీతితో గగ్గోలుపెడుతూ తాము వున్న చోటుకు వచ్చిన ఎడారిదొంగలను చూసి, హసన్‌గోరీ విజయసూచకంగా నవ్వాడు. ఎన్నో ఏళ్లనుంచి ఎడారిప్రాంతాల్లో ప్రయాణించే వర్తకులను దోచుకు బతుకుతున్న యీ దొంగలు, యింత తేలికగా తన చేత చిక్కుతారని అతడెన్నడూ వూహించలేదు.

ఈ విజయానికి కారణం పద్మపాదుడైనా, నవాబు తనను తప్పక బహూకరిస్తాడని అతడు భావించాడు. ఆ కారణంవల్ల హసన్ గోరీ పద్మపాదుడితో, "పద్మపాదా, మీశక్తి సాటిలేనిది. ఈ క్రూరకర్ములను పట్టుకునేందుకు చాలా సంవత్సరాలనుంచి నేను ప్రయత్నిస్తున్నాను. ఈనాటికి మీ సహాయంవల్ల అది సాధ్యమయింది. ఇక, ఈ ఎడారి ప్రాంతం వర్తకులకూ, యాత్రికులకూ ప్రయాణయోగ్యం అవుతుంది. మీ దయకు చాలా కృతజ్ఞుణ్ణి!" అన్నాడు.

పద్మపాదుడు చిరునవ్వు నవ్వుతూ, "హసన్! నేను చేయవలసిన సహాయమేదో చేశాను. ఇక యీ దొంగలను విచారించి శిక్షించవలసిన వాడివి నీవు. నా పెద్దపులు



లనూ, తోడేళ్లనూ ఉపసంహరించుకుంటు న్నాను," అంటూ చేతులు రెండూ పైకెత్తి, ఏదో మంత్రం పఠించాడు. మరుక్షణంలోనే తోడేళ్ళూ, పెద్దపులులూ మాయమయినై. పద్మపాదుడు తన గుప్పెళ్లలోకి వచ్చిన రాతిముక్కలను హసన్‌గోరీకీ, పింగళుడికీ చూపి, "ఇవే తోడేళ్ళూ, పెద్దపులులూ!" అంటూ వాటిని దూరంగా విసిరివేశాడు.

హసన్‌గోరీ ఆజ్ఞాపించగానే, అతడి సైని కులు ముందుగా దొంగలనాయకుడైన రాబందుకు సంకెళ్లు తగిలించి, తరవాత అతడి అనుచరులందరినీ, ఒకటిగా మోకు లతో బంధించారు. ఈలోపల పద్మపాదుడు, పింగళుణ్ణి ఎడంగా తీసుకుపోయి, "పింగళా! నీవు తిరిగి వెంటనే అవంతీనగరం వెళ్ళా లనుకుంటున్నావా?" అని అడిగాడు.

"అవును, పద్మపాదా! దుర్మార్గులైన నా అన్నలు నన్ను ఓడసరంగుకు అమ్మిన తరవాత, మా అమ్మనుకూడా నానాహింసలూ పెడుతూండివుంటారు. లోగడ వాళ్లు ఇలాగే చేశారు. వాళ్లకు కన్నతల్లిమీదకూడా ప్రేమ లేదు," అన్నాడు పింగళుడు.

"నీ బాధలన్నిటికీ కారణం నీవు భల్లూక కేతుణ్ణి ఆవాహన చేసుకునే మంత్రం మరిచి పోవటం. ఇదుగో ఆ మంత్రం మళ్ళీ చెపు తున్నాను. ఈసారి అయినా బాగా జ్ఞాపకం



పెట్టుకోవటం క్షేమం," అంటూ పద్మపాదుడు పింగళుడికి ఆ మంత్రం జ్ఞాపకంచేసి, తన చేతి చిటికెనవేలికి వున్న వుంగరాన్ని తీసి పింగళుడికి యిస్తూ, "ఇదిగో, యీ వుంగరాన్ని జాగ్రత్తగా కాపాడుకో. నీకు ఏనాడైనాసరే, నన్ను చూడాలని వుంటే, నీ మనసులో నన్ను తలుచుకుని, వుంగరాన్ని తాకితేచాలు, మరుక్షణం నేను నీ దగ్గరకు వచ్చి వాలతాను," అన్నాడు.

"పద్మపాదా! మీ మేలు ఎన్నటికీ మరవ రానిది. మీ సహాయంవల్ల తిరిగి నేను నా కన్నతల్లిని చూడగలుగుతున్నాను. మీరు కూడా నావెంట అవంతీనగరం రాగలరా? మిమ్మల్ని చూస్తే, మా అమ్మ ఎంతో సంతో షించగలదు," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు పింగళుడికేసి వాత్సల్యం వుట్టిపడేలాచూస్తూ, "పింగళా! నీవు చేసిన మేలుమాత్రం నేనెలా మరిచిపోగలను? నీ సహాయంవల్లనేగదా నేను మహామాయుణ్ణి జయించగలిగింది! కనుక, ఏదో ఒకనాడు నేను మీయింటికి అతిథిగా వచ్చి, మీతల్లి దర్శనంకూడా చేసుకుంటాను. సరే, ప్రస్తు తానికి నేను యీ బిడారువర్తకులను వదిలి, ఒంటరిగానే తీర్థయాత్రలకు బయలుదేర వలసివుంటుంది. ఇక వెళతాను," అంటూ చూస్తూండగానే మాయమయాడు.





పింగళుడు, హసన్‌గోరీ దగ్గిరకు వెళ్ళి, తాను తన దేశం బయలుదేరి పోతున్నట్టు చెప్పాడు. ఆ మాటలు వింటూనే, హసన్‌గోరీ ఆశ్చర్యపడి, "పింగళా! యివేమి మాటలు? ఏదో పక్కన వున్న వూరుకు బయలుదేరి పోతున్నంత తేలికగా చెపుతున్నావు! నీ దేశానికీ యీ దేశానికీ ఎన్నివేల మైళ్ళదూరమో తెలుసా?" అని అడిగాడు.

పింగళుడు చిరునవ్వు నవ్వి, "హసన్! నా శక్తిసామర్థ్యాలు నీకు తెలియవు. నావెంట ఆ కనబడే రాయిచాటుకు వచ్చావంటే, నీకు ఒక అద్భుతవ్యక్తి దర్శనం కలిగేలా చేస్తాను. నీ సైనికులూ, ఆ ఎడారిదొంగలూ



చూడటం మంచిదికాదు," అంటూ అక్కడికి దాపులనే వున్న ఒక పెద్ద రాతిచాటుకు దారితీశాడు.

పింగళుడు మనసులో మంత్రం జపించగానే, భల్లూకకేతుడు ప్రత్యక్షమై, అతడి ముందు మోకరించి, "ప్రభో, ఏమి సెలవు? చాలా కాలంగా యీ సేవకుణ్ణి మరిచి పోయారే!" అన్నాడు.

భల్లూకకేతుడి భయంకరాకారాన్ని చూస్తూనే, హసన్‌గోరీ పెద్దగా అరిచి అక్కడి నుంచి పారిపోబోయేంతలో, పింగళుడు అతడి చేయి పట్టుకుని ఆపుతూ, "హసన్! నీకు వచ్చిన భయం ఏమీలేదు. ఈ భల్లూక కేతుడు నా సేవకుడు!" అన్నాడు.

"ఈ రాక్షసుడు నీకు సేవకుడా!" అంటూ హసన్‌గోరీ మరింత ఆశ్చర్యపడ్డాడు.

"అవును," అంటూ పింగళుడు భల్లూక కేతుడి భుజాలమీదికి యెక్కి, "హసన్, యిక నేను నాదేశం పోతున్నాను. ఆకలి దప్పులతో అలమటించే నన్ను రక్షించావు. సర్వదా కృతజ్ఞుణ్ణి," అని, భల్లూకకేతుడితో, "భల్లూకా, నన్ను అవంతీనగరంలోని నా గృహానికి చేర్చు," అన్నాడు.

భల్లూకకేతుడు పెద్దగా హుంకరించి ఆకాశంలోకి లేచి, సముద్రాలూ, నదులూ,





కొండలూ దాటి సూర్యోదయానికల్లా పింగళుణ్ణి, అవంతీనగర పరిసరాలలోని అతడి యింటిదగ్గిర దించాడు.

శిథిలావస్థలో వున్న యింటిని చూస్తూనే పింగళుడు నిశ్చేష్టుడయాడు. అతడు యింటి తలవాకిటిని సమీపిస్తూండగానే, బక్కచిక్కపోయి, నీరసస్థితిలో వున్న తల్లి కనబడింది. ఉబికివస్తున్న దుఃఖాన్ని అపుకుంటూ పింగళుడు, "అమ్మా!" అంటూ తల్లిని కావిలించుకున్నాడు.

తల్లి ఒక్క క్షణకాలం నివ్వెరపోయి, అంతలో తన కుమారుణ్ణి గుర్తించి, "నాయనా, పింగళా! జీవించేవున్నావా? ఎంత అదృష్టవంతురాలిని!" అంటూ ఏడవసాగింది. పింగళుడు తల్లిని ఓదారుస్తూ, "అమ్మా, యిక మనకు వచ్చిన భయం లేదు. దుర్మార్గులైన నా అన్నలు యెక్కడ వున్నారు?" అని అడిగాడు.

"నాయనా, వాళ్లు నీకు చేసిన ద్రోహానికి శిక్ష అనుభవిస్తున్నారు. వాళ్లిద్దర్నీ రాజు కారాగారంలో బంధించాడు," అన్నది తల్లి.

"అలా అయితే నీవింత దీనస్థితిలో వున్నావేం? నేను వదిలిపోయిన ధనం, మహత్తుగల సంచీ వున్నవిగదా?" అని అడిగాడు పింగళుడు.



తల్లి పొంగివస్తున్న దుఃఖాన్ని దిగమింగుతూ, "నాయనా, వాటికోసమే రాజు వాళ్లను కారాగారంలో పడవేశాడు," అంటూ పింగళుడు ఓడసరంగుకు బానిసగా చిక్కిం తరవాత జరిగినదంతా వివరంగా చెప్పింది.

తల్లి చెప్పిందంతా విని పింగళుడు కోపోద్రేకంతో వణికిపోయాడు. "అమ్మా! యీ అవంతీనగర రాజుకు తగిన ప్రతీకారం నేను చేస్తాను," అంటూ అతడు భల్లూకకేతుణ్ణి ఆవాహనచేశాడు.

"ప్రభో, ఏమిసెలవు!" అంటూ భల్లూకకేతుడు ప్రత్యక్షమయాడు. "భల్లూకా! అవంతీనగర రాజు నా అన్నలిద్దరిని కారా



గారంలో బంధించాడు. వారిని తక్షణం యిక్కడికి తేవాలి. అంతేకాదు. అతడి కోశాగారంలో వున్న ధనాన్నికూడా యిక్కడకు తీసుకురావాలి. మహత్తు గల సంచీ కూడా అతడిదగ్గిరే వున్నది. దాన్నికూడా వెతికి తేవాలి," అన్నాడు పింగళుడు.

"చిత్తం ప్రభో!" అంటూ భల్లూకకేతుడు మాయమై, పాతాళంలోంచి రాజభవనంలోకి ప్రవేశించి, ధనాగారంలో వున్న మొత్తం ధనాన్నీ, మహత్తు గల సంచీనీ తీసుకుని, కారాగారంలోకి వెళ్ళాడు.

భల్లూకకేతుణ్ణి చూస్తూనే, పింగళుడి అన్నలు జీవదత్తుడూ, లక్షదత్తుడూ కెవ్వున కేకవేసి మూర్ఛపోయారు. భల్లూకకేతుడు క్షణంలో వారినిద్దరినీ భుజాలమీద వేసుకుని, పింగళుడి దగ్గిరికి వచ్చి, "ప్రభో! యిదుగో మహత్తు గల సంచి! యీ మూటలో రాజు ధనాగారంలో వున్న డబ్బంతా వుంది! వీరు మీ అన్నలు!" అంటూ అన్నిటినీ పింగళుడి ముందు వుంచాడు.

మూర్ఛపోయిన కుమారులను చూడగానే తల్లికి వాళ్లమీద ఎంతో వాత్సల్యం కలిగింది. ఆమె వాళ్ల ముఖాలమీద నీరు చల్లి, "నాయనలారా, నాయనలారా!" అంటూ ప్రేమగా పలకరించింది.




జీవదత్తుడూ, లక్షదత్తుడూ కళ్లు తెరిచారు. ఎదురుగా వాళ్లకు తల్లీ, పింగళుడూ కనిపించేసరికి ఒక్కసారిగా పైప్రాణాలు పైనే పోయినట్టయింది. వాళ్ళిద్దరూ పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, "అమ్మా, పింగళా! మమ్మల్ని క్షమించాలి. మాకు బుద్ధి వచ్చింది, మా పాపాలకు ఆ చీకటికొట్లలో ప్రాయశ్చిత్తం అనుభవించాం," అన్నారు.

ఆ మాటలతో పింగళుడికికూడా వాళ్ళమీద జాలి కలిగింది. అయినా అతడు వాళ్లిద్దరికేసీ కోపంగా చూస్తూ, "మీ యిద్దరికన్న పరమనీచులూ, ద్రోహులూ లోకంలో యెక్కడా వుండరు. కావాలంటే, ఈక్షణాన

మీ యిద్దరినీ భల్లూకకేతుడిచేత పాతాళంలో పూడ్చిపెట్టించగలను. కాని, సహోదరులన్న గౌరవంతో ఈ ఒక్కసారికి మిమ్మల్ని క్షమిస్తున్నాను. ఒకవేళ తిరిగీ మీరు ఏనాడైనా నాకుగాని, అమ్మకుగాని ద్రోహం తలపెట్టారో... మిమ్ములను ముక్కలు ముక్కలుగా నరికిస్తాను!" అన్నాడు.

"క్షమించు తమ్ముడూ, మాకు బుద్ధి వచ్చింది!" అన్నారు జీవదత్తుడూ, లక్షదత్తుడూ ఏకకంఠంగా.

పింగళుడు మహత్తు గల సంచీని తల్లికి యిస్తూ, "అమ్మా, వెంటనే భోజనం సంగతి చూడు," అని చెప్పి, భల్లూకకేతుణ్ణి దగ్గరకు పిలిచి, "భల్లూకా! నదీతీరాన కనబడుతున్న ఆ చెట్లగుంపులో యీ రాత్రి గడిచి, సూర్యోదయం అయ్యేలోగా, నాకు చక్కని భవనం కట్టించాలి. ఆ భవనం అన్నిటా అవంతీనగర రాజప్రాసాదాన్ని మించిపోవాలి. తెలిసిందా?" అన్నాడు.

"చిత్తం, ప్రభో! భల్లూకపర్వతాల్లో వున్న నా అనుచరుల్లో గొప్ప గొప్ప శిల్పులున్నారు. కో అంటే వాళ్లంతా క్షణాలమీద వచ్చి దిగుతారు. ఆ గుంపును పిలుచుకు వచ్చి, యిప్పుడే పని ప్రారంభించమని సెలవా?" అన్నాడు భల్లూకకేతుడు.

"పగటివేళలో నీ రాక్షసగణమంతా యిక్కడికి రావటం ప్రమాదకరం. మిమ్మల్ని చూచిన తరవాత, యీ అవంతీనగరంలో పిట్టకూడా వుండేందుకు భయపడుతుంది. ప్రజలందరూ నగరం వదిలి పారిపోవటం, నా కిష్టం లేదు. కనుక, సూర్యాస్తమానం అయిన తరవాత పని ప్రారంభించు!" అన్నాడు పింగళుడు.

"చిత్తం, ప్రభో! భల్లూకపర్వతాలకు వెళ్లి, నా అనుచరులకు యీసంగతి చెప్పి, పొద్దుగూకేసరికల్లా పని ప్రారంభిస్తాను," అంటూ భల్లూకకేతుడు మాయమయాడు.

—(వచ్చే సంచికలో ముగింపు)



# తప్పిపోయిన మోక్షం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్లి శవాన్ని దించి భుజాన వేసుకుని, మరొకసారి శ్మశానంకేసి మౌనంగా నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు చేసే ఈ పని మంచిదో కాదో జాగ్రత్తగా ఆలోచించటం మంచిది. ఎందు చేతనంటే ఎంత దీర్ఘాయువు ఉన్నప్పటికీ మంచిపనులు చెయ్యటానికి వ్యవధి ఉండదు; వాటిని ఈ క్షణంలోనే చేయాలి. పూర్వం రత్నపాలుడనే రాజు యాభై సంవత్సరాల గడువులోపలకూడా ఒక్క మంచి పని చెయ్యలేకపోయాడు. నీకు అతని కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం అలకాపురాన్ని రత్నపాలుడనే రాజు ఏలుతూ ఉండేవాడు. అయనకు ఎంతసేపూ ఇహసుఖాలమీద మమకారమే గాని పరలోకాలనుగురించిన విచారమేలేదు.

## బేతాళ కథలు

భగవధ్యానం చేసేవాళ్లన్నా, పూజలూ పునస్కారాలూ చేసేవాళ్ళన్నా అయనకు చిరాకు. వేటాడటం, జూదాలాడటం, సంగీతాలూ, నృత్యాలూ, స్త్రీలతో సరససల్లాపాలూ అయన కిష్టం.

ఒకసారి శివరాత్రి వచ్చింది. ఆ రోజు అందరూ ఉపవాసాలుంటారు. జాగరం చేస్తారు. దేవాలయాలలో శివుడికి అభిషేకాలూ, అర్చనలూ జరుగుతాయి. ఇదంతా రాజుకు ఏ మాత్రమూ ఇష్టంలేదు. అందు చేత ఆయన ఆ రోజు తెల్లవారకమునుపే తన గుర్రం ఎక్కి, పరివారాన్ని వెంటబెట్టుకుని, అరణ్యంలో వేటాడబోయాడు.

రాజుగారి పరివారంలో చాలామందికి ఆ పుణ్యదినాన వేటాడటం ఏ మాత్రమూ ఇష్టంలేదు, కాని రాజుగారికి ఎదురాడలేక బయలుదేరారు. వారు అరణ్యంలో ప్రవేశించిన కొద్దిసేపటికల్లా కన్నుపొడుచుకున్నా కానరానంత చీకటి పడింది. దానికి కారణమేమంటే ఆకాశంనిండా నల్లని కారుమేఘాలు దట్టంగా అలుముకున్నాయి. కొద్ది సేపట్లో పెళపెళా ఉరుములూ, కళ్లు చెదిరేటట్టు మెరుపులూ సాగాయి. భయంకరమైన గాలి సాగి అరణ్యంలోని చెట్లన్నీ ఊగ్రూతలూగ నారంభించాయి. ఆ సమయంలో రాజుకు తప్ప మిగిలినవారందరికీ



భయం పుట్టింది. "ఈ పవిత్రదినంనాడు మనం వేటకు బయలుదేరాం. ఇందుకు భగవంతుడు తప్పక శిక్షించుతాడు!" అని అనుకుని వారు ఒక్కొక్కరే చీకటిచాటున రాజును విడిచిపెట్టి ఇంటిదారి పట్టారు.

రాజుమాత్రం వేట ఉత్సాహంలో దూరాన ఒక లేడిని చూసి తన గుర్రాన్ని అటుకేసి పరిగెత్తించాడు. లేడి ఎటో మాయమయింది. గాలితోపాటు వానకూడా ప్రారంభమయింది. అడవిలో అక్కడక్కడా పిడుగులుకూడా పడుతున్నాయి. ఒక పిడుగు రాజుగారికి అంతదూరంలో ఉన్న ఒక ఎత్తయిన చెట్టు పైన పడి చెట్టు రెండుగా చీలిపోయింది.

ఆ పిడుగుపాటుకు రాజుగారి గుర్రం బెదిరి దిక్కుతెలియకుండా పరిగెత్తి, జాము రాత్రి గడిచాక అరణ్యంలోనే ఒక పాడు బడిన దేవాలయం సమీపంలో వచ్చి నిల బడింది. గుర్రాన్ని కట్టేసి, రాజు మండపంలో చేరి ఒక స్తంభాన్ని ఆనుకుని గుడికేసి చూస్తూ కూచున్నాడు. ఆయన గుడిలోకి పోదామని మొదట అనుకున్నాడు గాని, అలా చేస్తే దేవుడు ఆగ్రహిస్తాడని ఆయనకు అనుమానం వేసింది.

"ఇప్పటికే దేవుడికి నాపై కోపంవచ్చింది. ఈ రోజు నేను వేటకు బయలుదేరటం పొరపాటే. అందుకే దేవుడు ఈ పిడుగుల





వాన పంపాడు. నాచేత ఇవాళ ఉపోషం చేయించాడు. ఈ రాత్రికి జాగరంకూడా చేయిస్తాడు!" అనుకున్నాడు రాజు.

ఇంకా గాలి వీస్తూనే ఉన్నది, వాన కురుస్తూనే ఉన్నది. కావాలనుకున్నా ఆయనకు నిద్రవచ్చే అవకాశంలేదు. నట్టడివిలో ఉన్న ఆ పాడుపడిన దేవాలయంకేసి చూస్తూ, స్తంభానికి చేరగిలబడి కూచున్న రాజుకు ఒక ఆశ్చర్యకరమైన దృశ్యం కంటబడింది.

అర్ధరాత్రిసమయంలో ఆ గుడితలుపు తెరుచుకున్నది. ఒక అర్చకుడులాటి మనిషి బయటికి వచ్చి, ఎవరైనా వచ్చారేమో అన్నట్టుగా అటూ ఇటూ చూసి మళ్ళీ లోపలికి వెళ్లి తలుపు వేసుకున్నాడు. నిర్జనమైన ఈ ప్రదేశంలో, అందులోనూ ఈ పాడుబడిన దేవాలయంలో అర్చకుడుండటమేమిటి? ఆయన పెట్టాడు కాబోలు, లోపల దీపాలు వెలుగుతున్నాయికూడా!

మరి కొంచెంసేపు గడిచాక ఆ అర్చకుడే మళ్ళీ బయటికి వచ్చి, ఎవరూ లేకపోవటం చూసి లోపలికి వెళ్లిపోయాడు.

ఈసారి రాజు అర్చకుణ్ణి జాగ్రత్తగా గమనించాడు. ఆ అర్చకుడు బతికివున్న మనిషి కాడనీ, దయ్యమనీ రాజుకు అనుమానం వేసింది. "ఎవరో అర్చకుడు చచ్చిపోయి కూడా ఈ ఆలయాన్ని వదలక దేవుడికి సేవ చేస్తున్నాడన్నమాట! ఎంత పుణ్యాత్ముడు! నేను ఏనాడూ దేవుణ్ణి తలుచుకుని ఎరగను! ఇక నేనుకూడా నా జీవితాన్ని భగవంతుడి సేవకు అంకితం చెయ్యాలి!" అనుకున్నాడు రాజు.

మూడోసారి అర్చకుడు తలుపు తెరిచి బయటికి రాగానే రాజు మండపంలోనుంచి ఇవతలికి వచ్చి అర్చకుణ్ణి సమీపించి, "తమరెవరు, స్వామీ? ఇక్కడ ఎంత కాలంగా ఉంటున్నారు?" అని అడిగాడు.

అర్చకుడికి రాజును చూడగానే ఆనందమయింది. "ఎవరూ రాలేదే అనుకుం

టున్నాను. లోపలికి రా, నాయనా! నేను నూరేళ్ళుగా ఈ గుడికి అర్చకుణ్ణి. కనీసం శివరాత్రినాడైనా భక్తులు వస్తారేమో అనుకుంటాను. ఎన్నో యేళ్లతరవాత నువు వచ్చావు. ఈశ్వరుడి అభిషేకం చేయిస్తావా?" అన్నాడు అర్చకుడు.



"లేదు! నేను పాపాత్ముణ్ణి. ఈ స్థితిలో నేను ఆలయంలోకి రావటం భావ్యంకాదు. అయినా నాకు ఈశ్వరధ్యానం చేసి తరించుదామని కోరిక ఉంది. తమకు తెలిస్తే నాకొక్క సంగతి వివరించి చెప్పగలరా?" అన్నాడు రాజు.

"నాకు తెలిస్తే చెబుతాను, నాయనా!" అన్నాడు అర్చకుడు.

"నే నింకా ఎంతకాలం బతుకుతాను, ఎప్పుడు పోతాను?" అని రాజు అడిగాడు.

"నువు యింకా యాభైఏళ్ళు బతికి ఈ శివరాత్రి పుణ్యదినాన అర్ధరాత్రికి దేహం చాలిస్తావు!" అన్నాడు అర్చకుడు.

రాజుకు పరమానందమయింది. ఆయన అర్చకుడివద్ద సెలవు పుచ్చుకుని, మండపంలోకి వచ్చి, తెల్లవారేదాకా నిద్రపోయి, తరవాత తన నగరానికి వెళ్ళిపోయాడు.

ఇంటికి వెళ్లి ఆయన, "నాకింకా యాభై ఏళ్ళు ఆయుర్దాయం ఉన్నది. ఇందులో ఇరవై అయిదేళ్ళు ఇలాగే అనుభవించవలసిన సుఖాలన్నీ అనుభవించి, మిగిలిన ఇరవైఅయిదు సంవత్సరాలూ నిశ్చలంగా భగవంతుణ్ణి ధ్యానించి తరించుతాను," అనుకున్నాడు.

ఇలా నిర్ణయించుకున్నాక రాజు ఎప్పటికన్నా ఎక్కువగా సౌఖ్యాలలో మునిగి తేలసాగాడు. పాతిక సంవత్సరాలూ ఒక్క క్షణంలాగా గడిచిపోయాయి.

ఈ సంగతి తెలియగానే రాజు ఆశ్చర్యపడి, "చూస్తూండగానే ఇరవైఅయిదేళ్ళు గడిచిపోయాయే! అయినా నాకింకా ప్రపంచ సుఖాలమీద విరక్తి కలుగలేదు. మిగిలిన

ఇరవైఅయిదు సంవత్సరాలూ ఈశ్వరుణ్ణి ఏకచిత్తంతో ధ్యానించటం నాకు సాధ్యం కాదు. అందుచేత మరొక పదిహేను సంవత్సరాలు సుఖాలు అనుభవించి, మిగిలిన పదివేళ్ళూ ఈశ్వరుడిపైనే మనసు లగ్నం చేసి మోక్షం సంపాదిస్తాను!" అనుకున్నాడు.

పదిహేనేళ్ళుకూడా క్షణంలాగే గడిచాయి. రాజుకు ప్రపంచ సుఖాలమీద ఇంకా విరక్తి రాలేదు. "నిశ్చల చిత్తంతో ఈశ్వరుణ్ణి మూడేళ్ళు ధ్యానిస్తే చాలదా?" అనుకున్నాడు.

తన ఆయుర్దాయం మరి మూడేళ్ళే ఉన్నదని తెలియగానే, "ఒక్క సంవత్సరం చాలకపోతుందా?" అనుకున్నాడు. సంవత్సరం ఆరునెలలయింది. ఆరు నెలలు మూడునెలలయాయి. మూడునెలలు కాస్తా మూడురోజులయాయి.

రాజుకు ఆవేదన పుట్టింది. ఆయన మనస్సింకా భగవంతుడివేపు తిరగనేలేదు. "నా ఆయుర్దాయం ఇంకా మూడురోజులే ఉంది. కాని ఈ మూడురోజులూ ఏకాగ్రతతో నేను ఈ ఈశ్వర ధ్యానం చెయ్యలేను. నిజమైన భక్తితో ఈశ్వరుణ్ణి మూడు విఘడియలు ధ్యానించినా మోక్షం వస్తుందిగదా! నా జన్మను ఆఖరురోజైన శివరాత్రి దినమంతా ఈశ్వరారాధనలో గడిపేస్తాను.



అంతటితో నా పాపాలన్నీ పరిహార మవు తాయి!" అనుకున్నాడు రాజు.

రాజు జీవితంలో ఆఖరురోజు వచ్చింది. కాని ఆయనకింకా సుఖాలమీద విరక్తి కలగలేదు. "ఏమన్నా అనుభవించాలంటే నాకు ఈ జన్మకు ఈ ఒక్కరోజే మిగిలి ఉన్నది. సూర్యాస్తమయం అయేదాకా నా కిష్టమైన సుఖాలన్నీ అనుభవించి ఆ తర వాత ఈశ్వరధ్యానం ఆరంభిస్తాను!" అను కున్నాడాయన.

ఆయన అలాగే చేశాడు. సూర్యాస్త మయంకూడా అయింది. రాజు ఆందోళనతో తన మంత్రిని పిలిచి, "మంత్రీ, భగవత్సం కీర్తన చేసేవారిని పిలిపించు. నాకిక వ్యవధి లేదు. ఈ అర్ధరాత్రితో నాకు ఆయువు నిండుతుంది. ఈ రెండు జాములూ భగవ న్నామం స్మరిస్తూ దేహం చాలించి కైలాసం చేరుకుంటాను!" అన్నాడు.

"అదేంమాట, మహారాజా! తామింకా నూరేళ్ళు జీవిస్తారు!" అన్నాడు మంత్రి.

"లేదు, నా చావు సంగతి నాకు పూర్తిగా తెలుసు. వ్యవధి లేదు. అందుచేత వ్యర్థ ప్రలాపాలు చెయ్యక వెంటనే భజన చేసే వారిని పిలిపించు!" అన్నాడు రాజు.

అయితే భజనవాళ్ళు వచ్చేలోగానే రాజుకు అకస్మాత్తుగా మూర్ఛలాటిది వచ్చి



పడిపోయాడు. ఆ మూర్ఛతోబాటు వచ్చిన మైకం నుంచి ఆయన కోలుకోనేలేదు. సరిగా అర్ధరాత్రి సమయానికి ఆయన ప్రాణాలు శరీరాన్ని విడిచిపెట్టాయి.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక్క సందేహం. రత్నపాలుడు యాభై సంవత్సరాలు గడువు ఉండికూడా తన మనసును భగవంతుడిపైన ఎందుకు లగ్నం చెయ్యలేకపోయాడు? భగవధ్యానంమీద ఇష్టం లేకనా? లేక విధి అనుకూలించకనా? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రత్నపాలుడికి భగవధ్యానం చేసి తన పాపాలు పరిహారం చేసుకోవాలనీ, మోక్షం పొందాలనీ కోరిక ఉన్న మాట యధార్థమే. అయితే ఆ కోరిక నెరవేరకపోవటానికి కారకుడు ఆయనే. ఎందుచేతనంటే ఆయనకు మోక్షసుఖంమీద కోరిక ఉన్నా, ఇహసుఖాలమీద కోరిక చావలేదు. ఈ రెండు కోరికలకూ తావు లేదని ఆయన గ్రహించలేదు. ఇహసుఖాలు అనుభవించగా అనుభవించగా తన మనస్సుకు వాటిపై విముఖత్వం కలుగుతుందని ఆయన భ్రమపడ్డాడు. ఇహసుఖాలు ఊబిలాటివి. వ్యవధి ఇచ్చినకొద్దీ అవి మనస్సును తమలోకే లాక్కుంటాయి. స్థిరబుద్ధితో ఒక్క విఘడియ భగవంతుణ్ణి స్మరించినా చాలునన్నమాట నిజమే గాని, ఆ స్థిరచిత్తం సాధించటానికి ఎన్నో ఏళ్ళు కృషిచెయ్యాలి. రత్నపాలుడు అలాటి కృషి ఏమాత్రమూ చేయలేదు. అదే ఆయన చేసిన తప్పు. అందుకే ఆయనకు యాభై సంవత్సరాల వ్యవధికూడా చాలకుండా పోయింది; భగవంతుణ్ణి తలుచుకోకుండానే మరణించాడు!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)



# నాగరికత

ఒక తోడేలుకు నాగరికంగా జీవించాలని బుద్ధిపుట్టి ఒక కుక్కతో స్నేహం చేసింది. కుక్కదారే పొయ్యే జంతువులను పలకరించటమూ పరామర్శించటమూ తోడేలు గమనించింది.

అవిరెండూ కలిసి ఒక పచ్చిక బయలులోకి వచ్చాయి. అక్కడ గడ్డి మేస్తూ ఒక గొర్రెపొట్టేలు కనిపించింది. తోడేలుకు ఆకలి వేస్తున్నది. అది కుక్కవేపు తిరిగి, "ఈ గొర్రెపొట్టేలును ఏం చేద్దాం, కుక్కా ?" అన్నది.

"నీ యిష్టం, తోడేలూ !" అన్నది కుక్క.

తోడేలు గొర్రెపొట్టేలును సమీపించి, "నువు నేలమీద పడుకో !" అన్నది.

"దేనికి ?" అన్నది గొర్రెపొట్టేలు.

"నిన్ను చంపి తింటాను !" అన్నది తోడేలు.

"నీకు అంత శ్రమకూడా దేనికి ? నోరు తెరిచి నిలబడు. నేను పరిగెత్తుకుంటూ వచ్చి నీ నోట్లో దూకుతాను !" అంటూ గొర్రెపొట్టేలు అంత దూరం వెనక్కుపోయి విసురుగా వచ్చి, నోరు తెరిచి నిలబడి ఉన్న తోడేలును డొక్కలో బలంగా కుమ్మింది.

ఆ దెబ్బతో స్పృహతప్పి పడిపోయిన తోడేలు, మళ్ళీ స్పృహ తెలియగానే, నాగరికతకు ఒక దణ్ణం పెట్టి అడవికి వెళ్ళిపోయింది.






## 9

[అద్భుతదీపం సహాయంతో రాజకుమార్తెను పెళ్లాడి, అద్భుతమైన భవనంలో హాయిగా జీవిస్తున్న అలాదీనుకు అనుకోకుండా కష్టకాలం దాపరించింది. అతను వేటకు వెళ్లిన సమయంలో మొరాకో మాంత్రికుడు వచ్చి అలాదీన్ భార్యకు కొత్త దీపం ఇచ్చి అద్భుత దీపాన్ని తీసుకుని, దాని సహాయంతో అలాదీన్ భవనాన్ని, రాజకుమార్తెనూకూడా తన దేశానికి తీసుకుపోయాడు. రాజు అలాదీన్‌పై ఆగ్రహించి, తన కుమార్తెను నలభై రోజుల లోగా తెచ్చి చూపకపోతే తల తీయిస్తానన్నాడు. అలాదీన్ ఆ నగరం విడిచి పోయాడు.]

అలాదీన్ వెళ్లగా వెళ్లగా ఒక నది వచ్చింది. దాన్ని చూడగానే అతనికి అందులో దూకి ఆత్మహత్య చేసుకుని తన కష్టాలు అంతం కావించుకోవాలనిపించింది. ఎందుకంటే తన భార్య ఎక్కడ ఉన్నదీ అతనికి తెలియదు. ఆమెకోసం ఎలా వెతకటం?

అయితే మరుక్షణమే తన తప్పు తెలిసి వచ్చింది. భగవంతుడు చేసిన నిర్ణయాలను గురించి వితర్కించటానికి తనకు అధికారంలేదనీ, ఆత్మహత్య మహాపాతకమనీ అతను జ్ఞాపకంచేసుకున్నాడు. దానితో అతని గుండెబరువు తగ్గినట్టయింది.

అలాదీన్ ఆత్మహత్యాప్రయత్నం మాని నదిలోకి దిగి, స్నానంచేసి, దోసిట నీరు తీసి విడిచి, చేతులు రుద్దుకున్నాడు. అతను అనుకోకుండా తన వేలిఉంగరాన్ని రుద్దేసరికి ఉంగరంభూతం భయంకరాకారంతో ప్రత్యక్షమై, "ఏమి సెలవు?" అని అడిగింది.

బి. ప్రసాదరావు

అలాదీన్ మొదట నిర్ఘాంతపోయి, తర వాత తెప్పరిల్లుకుని పరమానందంతో, "ఓ భూతమా, నా భవనాన్నీ, అందులో వున్న నా భార్యనూ తిరిగి నాకు చేర్చు!" అన్నాడు.

"దీపంభూతాన్ని ధిక్కరించి నేనా పని చెయ్యటం సాధ్యంకాదు, యజమానీ!" అన్నది ఉంగరంభూతం.

"అలా అయితే కనీసం నన్ను నాభార్య ఉండే ఇంటివద్దనైనా దిగబెట్టు!" అన్నాడు అలాదీన్.

అతని మాట అతని నోట వుండగానే ఉంగరంభూతం అతన్ని మొరాకో తీసుకు పోయి అతని భవనంపక్కన దింపింది.

సరిగా అదేసమయానికి, ఏ దేవుడో ప్రేరే పించినట్టుగా, ఒక దాసీది కిటికీ తెరిచి రాజ కుమార్తెతో, "అమ్మగారూ, ఈ సాయం కాలం ఎండలో తోట ఎంత అందంగా ఉందో చూశారా?" అన్నది.

ఇంతలోనే దాసీకి అలాదీన్ కనిపించాడు. అది గట్టిగా కేకపెట్టి, "అమ్మా, అదుగో అయ్యగారు!" అన్నది.

రాజకుమార్తె కిటికీవద్దకు పరిగెత్తుకు వచ్చింది. భార్యాభర్తలిద్దరూ ఒకరినొకరు చూసుకుని దిగ్భ్రమ చెందారు. రాజకుమార్తె తన ఆశ్చర్యాన్ని అణుచుకుని, "త్వరగా




లోపలికి రండి! ఏమీ భయంలేదు. మాంత్రి కుడు ఎటో వెళ్ళాడు," అన్నది.

దాసీది వెళ్ళి ఒక రహస్యద్వారం తెరి చింది. అలాదీన్ లోపలికి వచ్చి తన భార్యను ఆలింగనం చేసుకున్నాడు. ఇద్దరూ కాస్సేపు ఆనందంతో కన్నీరు కార్చారు.

అలాదీన్ తన భార్యతో, "నేను వేటాడ టానికి వెళ్లేటప్పుడు నాగదిలో బల్లమీద ఒక రాగిదీపం పెట్టాను. అది ఏమయింది? కనబడలేదు," అన్నాడు.

"అదే మన కొంప తీసింది. తప్పు పూర్తిగా నాదికూడా కాదు," అంటూ రాజ కుమార్తె జరిగిన సంగతి అంతా చెప్పి,

"ఇక్కడికి వచ్చాక ఆ దొంగవెధవ నాకా దీపం శక్తి ఏమిటో చెప్పేశాడు. దాని శక్తి తోనే మన భవనాన్ని ఇక్కడికి తీసుకువచ్చి నట్టుకూడా చెప్పాడు," అన్నది.

"ఆ మాంత్రికుడికి నీతో ఏం పనీ?" అని అడిగాడు అలాదీన్.

"రోజూ నాదగ్గిరికి వచ్చి నా మనస్సు తనవైపు తిప్పటానికి ప్రయత్నిస్తాడు. అందుకుగాను నాతో చాలా విషయాలు చెప్పాడు. మా నాన్న నీ తల తీయించాడని చెప్పాడు. మీ తండ్రి ముస్తఫా అనే ఒక పేద దర్జీవాడనీ, తన దయవల్లనే నువు ఇంతవాడి వయావనీ చెప్పాడు. వాడు ఎంతసేపు మాట్లాడినా నేను బెల్లంకొట్టిన రాయిలాగా ఉండిపోతున్నాను. అందుచేత వాడు మోహం వేళ్లాడేసుకుని వెళ్లిపోతున్నాడు. కాని వాడు నన్నెక్కడ బలాత్కరిస్తాడో అని భయపడి చస్తున్నాను. ఇంతలోనే దేవుడి దయవల్ల నువు వచ్చేశావు!" అన్నది రాజకుమార్తె.

అలాదీన్ తల ఆడించి, "అయితే వాడా దీపాన్ని ఎక్కడ దాస్తాడో నీకు తెలుసా?" అని అడిగాడు.

"వాడు దాన్ని ఎక్కడా దాయడు. చొక్కాలోపల కట్టుకు తిరుగుతాడు," అన్నది రాజకుమార్తె.



"మరీ మంచిది. నువు కాస్సేపు అవతలికి వెళ్లు!" అన్నాడు అలాదీన్. రాజ కుమార్తె అవతలికి వెళ్లగానే అతను తన ఉంగరాన్ని రుద్దాడు. ఉంగరంభూతం ప్రత్యక్షమై, "ఏమి సెలవు?" అన్నది.

"నీకు ఘూటైన విషాలేమైనా తెలుసునా?" అని అలాదీన్ భూతాన్ని అడిగాడు.

"ఓ, చాలా తెలుసు!" అన్నది భూతం.

"అయితే, ఏనుగునుకూడా క్షణంలో పడగొట్టగల కాలకూటం పట్టుకురా!" అన్నాడు అలాదీన్.

భూతం అదృశ్యమై ఒక క్షణంలో ఒక పొట్లం తెచ్చి అలాదీన్‌కు ఇచ్చింది.

భూతాన్ని పంపేసి అలాదీన్ తన భార్యను పిలిచాడు. ఆమె చేతికి పొట్లం ఇచ్చి, మాంత్రికుడు వచ్చినప్పుడామె ఏమి చెయ్యాలో వివరంగా చెప్పాడు. తరవాత అతను ఒక అలమారులో దూరి దాక్కున్నాడు.

అలాదీన్ తనపై పెట్టిన పని రాజ కుమార్తెకు ఎంతమాత్రమూ ఇష్టంలేదు. అయినా అతని ఆజ్ఞప్రకారం ఆమె తన దాసీలను పిలిచి తన జుట్టు దువ్వించుకుని, అందంగా ముడి వేయించుకున్నది. తన చీరె లన్నిటిలోకీ అందమైన చీరె కట్టుకుని రత్నాల వడ్డాణం పెట్టుకున్నది. తన మెడకు





ముత్యాల చేరు చుట్టుకున్నది. కాళ్ళకూ, చేతులకూ రత్నాభరణాలు పెట్టుకున్నది. ఏడు రకాల అత్తరులు పూసుకుని దేవతా స్త్రీలాగా తయారై మాంత్రికుడి రాకకు ఎదురుచూస్తూ హంసతూలికాతల్పంపై పడుకున్నది.

మామూలు వేళకు మాంత్రికుడు వచ్చాడు. రాజకుమార్తె లేచి చిరునవ్వు నవ్వుతూ ఎదురువెళ్ళి, వచ్చి కూచోమని ఆహ్వానించింది. మాంత్రికుడు ఆనందాశ్చర్యాలతో ఒక ఆసనంమీద కూచున్నాడు.

"నాలో మార్పు మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. కాని, చనిపోయిన భర్తకోసం ఇంకెన్నాళ్ళు ఏడవను? నాకు ఆనందం కావాలి. నేనెన్నడూ కష్టాలు ఎరిగినదాన్ని కాను. మనసు కష్టపెట్టుకుంటే పోయిన వారు వస్తారుగనకనా!...నా తెలివి తెల్లవారా! కబుర్లలో పడి మీకు తాగటానికివ్వటం కూడా మరిచాను!" అంటూ రాజకుమార్తె ఒక బల్లవద్దకు వెళ్ళి, మాంత్రికుడికి వీపు పెట్టి నిలబడి ఒక గ్లాసులో విషంవేసి, షర్బతు పోసి మాంత్రికుడికి దాసీచేత ఇప్పించింది.

"నీ చిరునవ్వులో ఉన్న మాధుర్యంతో పోలిస్తే ఈ షర్బతు తీపి ఏపాటి?" అంటూ మాంత్రికుడు షర్బతు తాగేసి, మరుక్షణం దుంగలాగా తివాసీపై విరుచుకు పడిపోయాడు.

మాంత్రికుడు పడిపోయిన చప్పుడు వినగానే అలాదీన్ తాను దాగిఉన్న చోటునుంచి బయటికి వచ్చాడు. మాంత్రికుడి ప్రాణాలు పోయినట్టు రూఢి చేసుకుని, అయన చొక్కాలోపలినుంచి అద్భుతదీపాన్ని పైకి తీశాడు. తరవాత అతను తన భార్యను అవతలికి పంపి, దీపాన్ని రుద్దాడు. భూతం ప్రత్యక్షమై, "ఏమి సెలవు?" అని అడిగింది. "ఈ భవనాన్ని ఉన్నపాళంగా యథాస్థానానికి చేర్చు!" అన్నాడు అలాదీన్.

మరుక్షణం అలాదీన్ భవనం యథా స్థానం చేరుకున్నది. అలాదీన్ రాజ కుమార్తెను పిలిచి, "మనం మళ్లీ ఇంటికి వచ్చేశాం. కాని ఈ రాత్రివేళ మీ నాన్నను చూడటం అంత బాగుండదు. రేపు చూద్దాం!" అన్నాడు.

ఎడబాటు కలిగినాక ఆ భార్యాభర్తలు నిద్రాహారాలు విసర్జించారు. ఇప్పుడు వారిద్దరూ సుఖంగా భోజనం చేసి నిశ్చింతగా నిద్రపోయారు.

మర్నాడు తెల్లవారింది. తెల్లవారుతూనే తన కూతురికోసం ఒక శోకం పెట్టటం రాజు గారికి అలవాటు. అయన కిటికీలోనుంచి బయటికి చూసేసరికల్లా అలాదీన్ భవనం యథాస్థానంలో కనిపించింది.

అయన సంతోషంతో పిచ్చివాడులాగా అయిపోయి పరిగెత్తుకుంటూ వెళ్లి అలాదీన్ భవనాన్ని చేత్తో తాకి చూశాడు. అది భ్రమ కాదు. భవనం చేతికి గట్టిగానే తగిలింది. అయన మెట్లమీదుగా దూకుతూ వెళ్లి అలాదీన్, తన కూతురూ ఉన్న చోటు చేరుకుని, తన కూతుర్ని ప్రేమతో కౌగలించుకుని ఆనందబాష్పాలు రాల్చాడు.

"అమ్మా, నిన్ను మళ్లీ ఎప్పటిలాగా చూస్తాననుకోలేదు. పైకి కనిపించకపోయినా



నువు చాలా యమయాతన అనుభవించి ఉండాలి. నన్ను విడిచి ఒక్క క్షణం ఉండ లేవుగదా! ఏం జరిగిందో విపులంగా చెప్పు!" అన్నాడాయన తన కుమార్తెతో.

రాజకుమార్తె జరిగినదంతా చెప్పి, "తప్పు నిజంగా నాదే. నాది కానివస్తువు మరొకరికి ఎందుకివ్వాలి?" అన్నది.

తరవాత అలాదీన్ రాజుగారికి మాంత్రికుడి శవాన్ని చూపి, "ఇడుగో, మా కష్టా లన్నిటికీ కారకుడు! వీడు నరకంలో తప్పక అనుభవిస్తాడు!" అన్నాడు.

రాజుగారు అలాదీన్ నిర్దోషి అని గ్రహించి అతన్ని కౌగలించుకుని, "నాయనా, నీపట్ల

కఠినంగా ప్రవర్తించానని నీ మనసును కష్ట పెట్టుకోకు. నాకు మా అమ్మాయి అంటే అంత ప్రాణం! ఆ విషయం ఇతరులు గ్రహించినా గ్రహించకపోయినా నువ్వు గ్రహించాలి. దానికోసం నేను రాజ్యమైనా ఇచ్చేస్తాననుకో!" అన్నాడు.

"మీ తప్పేమీ లేదులెండి. నామూలానే మీ కుమార్తె పోయిందనుకున్నారు. ఒక విధంగా అది నిజమేకూడానూ. ఎందుచేతనంటే మాంత్రికుడు అద్భుతదీపం మీద కన్నువేసి ఉంచుతాడనీ, ఏదో మాయోపాయం చేసి దానిని సంగ్రహించుతాడనీ నేను ముందుగానే ఊహించి తగు జాగ్రత్త పడవలిసింది. నా చరిత్ర అంతా తీరుబడిగా మీకు చెబుతాను, అప్పుడుగాని ఈ మాంత్రికుడి దుర్మార్గం మీకు బోధపడదు," అన్నాడు అలాదీన్.

"ముందు ఈ దుర్మార్గుడి శవాన్ని వదిలించుకో!" అన్నాడు రాజు. అలాదీన్ తన సేవకులను పిలిచి, "ఈ శవాన్ని పిడకల పోగుపైన పెట్టి దహించి, బూడిదను మురుకు చెరువులో వేయించండి!" అని వారికి ఉత్తరువిచ్చాడు.

ఈ వార్తలు నగరంలో తెలిశాయి. అలాదీన్ క్షేమంగా రాజకుమార్తెతో తిరిగివచ్చినందుకు ప్రజలు సంతోషించారు. మాంత్రికుడి దహనసంస్కారాన్ని వేడుకగా చూడటానికి వారు గుంపులు గుంపులుగా వచ్చారు.

రాజుగారు నగరమంతటా ఉత్సవాలు జరపమని చాటింపు వేయించారు. ఖైదీలందరినీ విడిచిపెట్టారు. పేదలకు దానధర్మాలు చేశారు. ఆ రాత్రి రెండు భవనాలలోనూ దీపాలు అలంకరించి వైభవంగా బాణాసంచా కాల్చారు.

మళ్లీ అలాదీన్ కష్టాలు గట్టెక్కాయి. అతను తన భార్యతోనూ, వృద్ధురాలైన తల్లితోనూ సుఖంగా జీవించసాగాడు.

—(ముగింపు వచ్చే సంచికలో)






(గత సంచిక తరువాయి)

ఆనందోద్యానం చేరేసరికి తోటద్వారం తెరిచిఉండటం చూసి ఖలీఫా ఆశ్చర్య పోయాడు. ఇబ్రాహీం ఎన్నడూ అంత అజాగ్రత్తగా ఉండడు. మహలును సమీపించాక ఖలీఫా ఆశ్చర్యం ఇంకా ఎక్కువయింది. లోపల ప్రార్థనలు మొదలైనవి జరుగుతున్న అలికిడి ఏమీ లేదు.

"లోపల ఏమి జరుగుతున్నదీ రహస్యంగా చూస్తాను," అంటూ ఖలీఫా జాఫర్ సహాయంతో ఒక చెట్టు ఎక్కి కిటికీలోకి చూశాడు. లోపల ఒక అందమైన యువతీ, యువకుడూ ఉన్నారు. ఇబ్రాహీం చేతిలో సారాయంలోటా పట్టుకుని, "అమ్మాయీ, నువు ఒక్క పాట పాడితేగాని మన ఆనందం పూర్తికాదు!" అంటున్నాడు.

ప్రియసఖికి ప్రోత్సాహం కలగటానికిగాను ముసలివాడు స్వయంగా ఒకపాట పాడాడు.

అది చూసి ఖలీఫాకు చాలా కోపం వచ్చింది. ఆయన గబగబా చెట్టు దిగివచ్చి, "తోట మాలి మనవడి ఉపాకర్మ ఎంత శాస్త్రోక్తంగా జరుగుతున్నదో నువుకూడా చూసి తరించు!" అని జాఫర్‌తో అన్నాడు.

జాఫర్ చెట్టెక్కి లోపల వినోదం జరుపుకుంటున్న ముగ్గురినీ చూశాడు. ఆయన చెట్టుదిగివచ్చి మాటా పలుకూ లేకుండా ఖలీఫా కాళ్ళమీద పడ్డాడు.

"విచారిస్తా వెందుకు, జాఫర్? నేను నిన్ను క్షమించానులే. ఇంకా ఏం జరుగుతుందో చూదాం, చెట్టెక్కు!" అన్నాడు ఖలీఫా నవ్వుతూ.

ఈలోపుగా తోటమాలి ప్రియసఖికోసం ఒక సితార్ తెచ్చాడు. దానిమీద వాయిస్తూ ఆమె ఒక పాట పాడింది. ఆమె కంఠం చాలా శ్రావ్యంగా ఉన్నది. ఖలీఫా ఆనందంతో జాఫర్‌కేసి తిరిగి, "జాఫర్, నేను

ఎస్. ధర్మారావు



ఇంత కోమలమైన కంఠం ఎన్నడూ వినలేదు!" అన్నాడు.

"అయితే ఏలినవారికి కోపం పోయి నట్టేనా?" అని అడిగాడు జాఫర్. అవు నన్నాడు ఖలీఫా. ఇద్దరూ చెట్టు దిగి వచ్చారు. తరవాత ఖలీఫా, "నేనిప్పుడు లోపలికి వెళ్ళి, వారిద్దరూ ఎవరో తెలుసు కోవాలి," అన్నాడు.

"ఉన్నపాళంగా తమరు లోపలికివెళితే వాళ్లు ముగ్గురూ కంగారుపడిపోతారు. వేషం మార్చాలి," అన్నాడు జాఫర్.

ఆ సమయాన కొలను దగ్గిర ఏదో అలికిడి అయింది. ఈ కొలనులోకి టిగ్రెస్‌నది నుంచి నీరు వస్తుంది. దానితోబాటు చేపలు కూడా వస్తాయి. వాటికిక్కడ ఇబ్రాహీం రోజూ ఆహారం వేస్తాడు. వాటిని పట్టేవారుండరు. అందుచేత ఈ కొలనులో చేపలు కుప్పలు తెప్పలుగా ఉంటాయి. నదిలో చేపలు దొరకని బెస్తవాళ్లు తోటమాలి కన్నుగప్పి అప్పుడప్పుడూ ఈ తోటలో ప్రవేశించి, చేపలు పట్టటం జరుగుతూంటుంది.

ఈ రాత్రి కరీం అనే బెస్తవాడు, వాకిలి తెరిచిఉండటం చూసి కొలనులో చేపలు పట్టవచ్చి ఖలీఫాకు దొరికిపోయాడు. ఖలీఫా వాణ్ణి గుర్తించి, "దొంగముండాకొడకా, కరీం! నువు చేస్తున్న పనేమిటి!" అన్నాడు.

కరీం ఖలీఫాను గుర్తించి భయపడుతూ, "ఏలినవారు క్షమించాలి! పొట్ట జరగక గడ్డి కరిచాను! పేదవాణ్ణి!" అన్నాడు.

ఖలీఫా నవ్వి, "ఫరవాలేదులే. వల వెయ్యి, నీ అదృష్టం చూస్తాను," అన్నాడు. కరీం వల వేసి చాలా చేపలు పైకి లాగాడు.

"నీ అదృష్టం బాగున్నదిరా! నీ బట్టలు విప్పి నాకిచ్చెయ్యి," అన్నాడు ఖలీఫా.

కరీం మారు మాటాడకుండా వాటిని విప్పి ఖలీఫాకిచ్చాడు. ఖలీఫా ఆ బట్టలు తొడుక్కొని కొన్ని చేపలు బుట్టలో వేసుకుని మహలు తలుపు తట్టాడు.

తోటమాలి తలుపు తెరిచి, ఖలీఫాను గుర్తించక, "నువా, కరీం? ఏం పనిమీద వచ్చావు?" అన్నాడు.

"నీకు అతిథులున్నారని తెలిసి చేపలు పట్టి తెచ్చాను," అన్నాడు ఖలీఫా.

ప్రియసఖి లేచివచ్చి, చేపలను చూసి సంతోషంగా, "వాటిని వేయించి పట్టుకు రావోయ్!" అన్నది.

ఖలీఫా సరేనని బయటికి వచ్చి జరిగిన విషయం జాఫర్‌తో చెప్పి, ఇబ్రాహీం ఉండే గుడిసెకు వెళ్ళి, నిప్పుచేసి తానే స్వయంగా చేపలను కోసి వేయించాడు. ఆయన వేయించి తెచ్చిన చేపలను తోటమాలీ, అలీ నూర్, ప్రియసఖీ తినేశారు.

తరవాత అలీనూర్ ఖలీఫా చేతిలో మూడు దీనారాలు పెడుతూ, "నువు చేసిన ఉపకారానికి ఇదుగో ప్రతిఫలం. ఒకప్పుడైతే నీ దారిద్ర్యాన్ని పోగొట్టగలిగిఉండే వాణ్ణి. కాని ఇప్పుడు అశక్తుణ్ణి కావటంచేత ఇంతే ఇవ్వగలుగుతున్నాను," అన్నాడు.

ఖలీఫా ఆ దీనారాలను కళ్ళకద్దుకుని బుట్టలో వేసుకుంటూ, "మీరిచ్చినదానికన్న కూడా నాకీ యమ్మ పాట వినాలని ఉంది. నేను పాట అంటే చెవి కోసుకుంటాను," అన్నాడు. అలీనూర్ అనుమతితో ప్రియసఖి



మరొకపాట పాడింది. ఖలీఫా ఆనందంతో, "అద్భుతం! అద్భుతం! అద్భుతం!" అని కేకలు పెట్టాడు.

అది చూసి అలీనూర్, "బెస్తవాడా, నీకు ఈమె నచ్చినట్టున్నది. ఈమెను నువే తీసుకో!" అంటూ లేచి వెళ్ళిపోసాగాడు.

ప్రియసఖి కళ్ళవెంట నీరు కారుస్తూ, "నన్ను వదిలేసి ఎక్కడికి పోతున్నావు, అలీనూర్?" అని అడిగింది.

ఇదంతా చూసి ఖలీఫాకు ఆశ్చర్యంతో బాటు బాధకూడా కలిగింది. ఆయన అలీనూర్‌తో, "అబ్బాయీ, నువ్వీ బానిసను ఎవరివద్దనుంచిగాని ఎత్తుకురాలేదుగదా?"

అన్నాడు. అలీనూర్ ఆయనకు తన కథ యావత్తూ చెప్పాడు. అంతా విని ఖలీఫా, "అయితే ఇప్పుడేం చెయ్యబోతున్నావు?" అని అడిగాడు.

"అల్లా సృష్టించిన ప్రపంచం చాలా విశాలమైనది. అందులో అనేక రహదారులున్నాయి!" అన్నాడు అలీనూర్.

"నేను ఒక పేద బెస్తవాణ్ణి గనక నీకు సహాయం చెయ్యలేననుకోకు. నేను చెప్పినట్టు చేస్తివా నీ కష్టాలు గట్టెక్కుతాయి," అంటూ ఖలీఫా తోటమాలిచేత కాగితం తెప్పించి దానిమీద బస్రా సుల్తానుకు ఈ విధంగా లేఖ రాశాడు:

"బస్రా సుల్తాను సులేమాన్‌కు ఖలీఫా హరూల్ అల్ రషీద్ వ్రాయునది ఏమనగా, ఈ లేఖ తెచ్చేయువకుడు వజీర్ అల్ ఫదల్ కుమారుడైన అలీనూర్. ఈ లేఖ చూడగానే నీవు గద్దె దిగి అలీనూర్‌ను నీ స్థానంలో సుల్తానుగా నియమించవలెను. ఆలస్యము చేయవద్దు."

ఈ లేఖపైన తన ముద్రవేసి ఖలీఫా ఆ ఉత్తరాన్ని అలీనూర్‌కిస్తూ, "దీన్ని తీసుకుపోయి బస్రాలో ఉండే సుల్తాను కియ్యి. నీ కష్టాలు తీరిపోతాయి," అన్నాడు.

అలీనూర్ అప్పుడే బయలుదేరి వెళ్ళిపోయాడు. ప్రియసఖి ఏడవసాగింది. తోట



మాలి ఖలీఫాకేసి తిరిగి, "పాపిష్టివాడా, నువు చూడు ఏం చేశావో! ఈ ఇద్దరికీ ఎడబాటు కలిగించావు! ముష్టిమూడుకాసులు చెయ్యని చేపలకు మూడుదీనారాలు పుచ్చుకున్నావు గదా, అంతతో తృప్తిపడలేక పోయావా?" అన్నాడు.

ఖలీఫా కళ్ళ వెంట నిప్పులు రాలాయి. ఆయన చప్పట్లు చరిచేసరికి వజీర్ జాఫరూ, మస్రూరూ లోపలికి వచ్చారు. జాఫర్ ఖలీఫా వేసుకున్న దుస్తులు తీసివేసి ఆయన సొంతదుస్తులు వేశాడు. తోటమాలి ఇబ్రాహీం కళ్ళు తెరుపుడు పడ్డాయి, అతని నిషా యావత్తూ దిగిపోయింది. అతను ఖలీఫా కాళ్ళపై పడ్డాడు. ఖలీఫా తోటమాలిని క్షమించి, ప్రియసఖితో, "అమ్మాయీ, నేనెవరో నీకిప్పుడు తెలిసింది గనక నీ భర్తవద్ద నుంచి కబురు వచ్చేదాకా మా యింట ఉండు!" అన్నాడు.

ప్రియసఖి ఖలీఫావెంట రాజభవనానికి వెళ్ళిపోయింది. అక్కడ ఆమెకొక గదీ, దాసీజనమూ ఏర్పాటు చేయబడ్డారు. ఖలీఫా ఆమెతో, "నీ యజమాని బస్రాకు సుల్తాను కాబోతున్నాడు. నువు రాణివవుతావు. అందుచేత నిర్విచారంగా ఉండు!" అన్నాడు. ఆమె రాజభవనంలో దాసీల మధ్య సుఖంగా ఉండసాగింది.





కొద్దికాలంలో అలీనూర్ బ్రసా చేరుకుని సుల్తాను దర్శనం చేసుకుని, ఆయనకు ఖలీఫా ఇచ్చిన లేఖ అందజేశాడు. సుల్తాను ఖలీఫా ముద్ర చూసి గౌరవంగా లేచి నిల బడి, లేఖను మూడుమార్లు కళ్లకు అద్దు కుని, విప్పి చదివాడు. తరవాత ఆయన, "ఖలీఫాగారి ఆజ్ఞ శిరసావహించి!" అన్నాడు.

ఖలీఫా ఆజ్ఞానుసారం తన పదవిని అలీ నూర్ పరం చేయటం కోసం సుల్తాను నగ రంలోని నలుగురు కాజీలనూ, అమీర్లనూ పిలవనంపాడు. సరిగా ఈ సమయంలో వజీరు సావీ అక్కడికి వచ్చాడు. సుల్తాను ఖలీఫాగారి ఉత్తరాన్ని సావీకి చదవటానికి ఇచ్చాడు. సావీ ఉత్తరం చదివి ఖలీఫా ముద్ర వున్నభాగం చించి అవతల పారేశాడు.

"నీచుడా, నీకు మతిపోయిందా? ఎందుకు చేశావీ పని?" అని సుల్తాను గద్దించాడు.

"ఈ దుర్మార్గుడు ఖలీఫాగారిని కలుసు కున్నాడని మీరు నమ్మకండి. వీడు టక్కరి, ఈ ఉత్తరాన్ని తానే సృష్టించాడు. ఖలీఫా గారే నిజంగా ఉత్తరం రాయదలిస్తే తన స్వంతకాగితాలపైని లేఖకులచేత రాయించి ఉండేవారు. దానిపైన రాజోద్యోగుల ముద్రలుకూడా ఉండేవి." అన్నాడు సావీ.

"అయితే నన్నిప్పుడేం చెయ్యమంటావు?" అని సుల్తాను అడిగాడు.

"వీణ్ణి నాకు పప్పగించండి. నిజం నేను తెలుసుకుంటాను. నేను వీడివెంట బాగ్దా దుకు మన ఉద్యోగిని ఒకణ్ణి పంపి నమ్మ దగిన ఉత్తరం తెప్పిస్తాను. నిజంగా వీడు మనని మోసగించినట్టయితే వీడికి తగిన విధంగా నేనే బుద్ధి చెబుతాను!" అంటూ సావీ చాలాసేపు మాట్లాడిన మీదట, అలీ నూర్ దోషి అని సుల్తానుకు నమ్మకం కుదిరిపోయింది. ఆయన అలీనూర్‌ను తన భటులచేత చావగొట్టించి, అతను స్పృహ తప్పి పడిపోయాక ఖైదులో పెట్టించాడు.

జైలు అధికారి పేరు కుతైత్. అతను అలీనూర్‌ను జైలులోకి తీసుకుపోయి, ఒక గదిలో పెట్టి, అతని చేతులకూ కాళ్లకూ వేసిన బేడీలు ఊడదీశాడు. ఆ గదిని తానే స్వయంగా శుభ్రంచేసి అక్కడ ఒక కంబలి పరిచాడు. తరవాత అతను అలీనూర్‌తో, "అయ్యా, నేను మీ తండ్రిగారికి చాలా ఋణపడి ఉన్నాను. అందుచేత నావల్ల మీకేమీ హాని జరగదు," అన్నాడు.

అది మొదలు నలభైరోజులపాటు ఈ అధికారి అలీనూర్‌కు వీలయిన 'సౌకర్యాలన్నీ కలగజేశాడు.

ఖైదీని గురించి రోజూ సాఫీకి వార్తలు పంపేటప్పుడు అలీనూర్‌ను చిత్రహింసలు చేసినట్టుగా తెలియజేస్తూ వచ్చాడు.

అలీనూర్ జైలు ప్రవేశించిన ముప్ఫై రోజులకు ఖలీఫా ఒకనాడు ఒక గదిపక్కగా వెళుతూఉండగా లోపల ఎవరో ఏడుస్తున్నట్టు వినిపించింది. ఆ ఏడిచేమనిషి ఎవరని నౌకర్లను అడిగాడు. వారు వెళ్ళి ప్రియసఖిని తెచ్చారు. ఆమెను ఖలీఫా పూర్తిగా మరిచాడు. అందుచేత ప్రియసఖి తన గొడవ యేూవత్తూ చెప్పుకుని, "అలీనూర్ వెళ్ళి నెల అయింది. ఇంతవరకు ఆయన వార్త తెలియలేదు," అన్నది.



అప్పుడు ఖలీఫాకు అంతా జ్ఞాపకం వచ్చింది. ఆయన ఒక నౌకరుద్వారా అలీనూర్‌కు ఒక మంచి బహుమానం పంపాడు.

అలీనూర్ జైలులో పడిన నలభైఒకటవ రోజున ఈ బహుమానం బస్రా చేరింది. అది ఎవరు పంపినదీ, ఎవరికి పంపినదీ సుల్తానుకు అర్థం కాలేదు. సాఫీని అడిగితే తనకు కూడా తెలియదన్నాడు. కాని ఆ బహుమానం ఒకవేళ ఖలీఫానుంచి అలీనూర్‌కు వచ్చిందేమోనని ఆయనకు అనుమానం తట్టింది. ఈ అనుమానమే నిజమైతే అలీనూర్ బతికిఉండటం తనకు క్షేమంకాదు. అందుచేత సాఫీ సుల్తానుతో, "ఆ దుర్మా

గ్గుడు అలీనూర్ చచ్చిపోవాలని తమరు అజ్ఞాపించారు కారూ ?" అన్నాడు.

"సరిగా జ్ఞాపకం చేశావు. వెంటనే వాడి శిరచ్ఛేదానికి ఉత్తరువియ్యి," అన్నాడు సుల్తాను కోపంగా.

ఈలోపుగా ఖలీఫాకు అలీనూర్ అసలు బతికి ఉన్నాడా లేదా అన్న అనుమానం వచ్చింది. అతను బతికి బాగుంటే ఈపాటికి ఏదో వార్త రావలిసిందే. అందుచేత ఆయన జాఫర్‌ను పిలిచి, "నువ్వు కొంత సాయుధ పరివారాన్ని వెంటపెట్టుకుని బస్రా వెళ్లు. అలీనూర్ బస్రాకు సుల్తాను అయిఉంటే సరేసరి ; లేక అతనికి ఏదైనా అపాయం జరిగిఉంటే, అపకారం చేసినవారిని బంధించి తీసుకురా! వారి రక్తం కళ్ల జూస్తాను!" అన్నాడు.

ఆరోజే జాఫర్ కొంత పరివారంతో బస్రాకు ప్రయాణమయాడు.

అక్కడ బస్రాలో అలీనూర్‌ను ఖైదు నుంచి రాజసభకు తీసుకువచ్చారు. అలీనూర్‌ను శిరచ్ఛేదం చెయ్యబోతున్నారన్న వార్త చాటింపు విని జనం తండోపతండాలుగా చూడవచ్చారు. వారందరికీ అలీనూర్‌పైన అభిమానమే.

సావీ తన భటులతో, "ఈ దుర్మార్గుణ్ణి గాడిదపై వేసి కట్టండి," అన్నాడు.



"అలీనూర్, ఈ ముసలివాణ్ణి చంపెయ్యటానికి అనుమతి ఇయ్యి!" అని జనంలో నుంచి కేకలు వచ్చాయి.

"మీరు తొందరపడకండి. రాసిపెట్టినది అనుభవించక తప్పేదిలేదు," అని అలీనూర్ వారితో చెప్పాడు.

తరవాత సావీ భటులు అలీనూర్‌ను ఒక గాడిదపై వేసి కట్టి వధ్యస్థానానికి తీసుకుపోయారు. శిరచ్ఛేదంచేసేవాడు కత్తి పట్టుకుని సిద్ధంగా ఉన్నాడు. పక్కనే ఉన్న రాజభవనం కిటికీనుంచి సుల్తానుగారు తల బయటపెట్టి చూసి అనుమతి ఇవ్వగానే మరణశిక్ష అమలు జరుగుతుంది. అందుచేత అందరూ ఆ కిటికీకేసి చూడసాగారు. కాని, ఎంతసేపటికీ సుల్తానుగారి తల కిటికీ వద్దకు రాలేదు. చిట్టచివరకు సుల్తానుగారు తల బయటపెట్టాడుగాని ఆయన చూపు వధ్యస్థానంకేసి తిరగలేదు. దూరాన గుర్రాలపై వస్తున్న జాఫర్ ఆయన పరివారం సుల్తానుగారి కంటబడింది. అందుచేత ఆయన మళ్ళీ లోపలికి తిరిగి తన భటులతో, "మనకోసం బాగ్దాదునుంచి ఎవరో వస్తున్నట్టున్నది. వారికి తగిన రీతిగా స్వాగతమిచ్చి నాకు కబురు చెయ్యండి!" అన్నాడు.

అలీనూర్‌కు మరణశిక్ష విధించబడిన వార్త ప్రజల నోటనే జాఫర్‌కు తెలిసింది.



ఆయన నిప్పులు కక్కుతూ సుల్తానును చూడవచ్చి, "అలీనూర్‌కు ఏమాత్రం అపాయం జరిగినా నేరస్థుల తలలు తీసేస్తాను! అలీనూర్ ఎక్కడ?" అని అడిగాడు.

వధ్యస్థానంనుంచి అలీనూర్‌ను సుల్తాను రప్పించాడు. సుల్తానును, సావీని ఖైదు చెయ్యమని ఉత్తరువిచ్చి, అలీనూర్‌ను బస్రాకు సుల్తానుగా జాఫర్ ప్రకటించాడు. ప్రజల ఆనందానికి అంతులేదు.

కొత్తసుల్తాను గౌరవార్థం మూడు రోజుల పాటు విందులూ వినోదాలూ జరిగాయి. నాలుగోనాడు జాఫర్ బాగ్దాదుకు ప్రయాణం కట్టాడు. "నాకు ఖలీఫాగారి దర్శనం చేసుకోవాలని ఉన్నది. నేనుకూడా బాగ్దాదుకు మీవెంట వస్తున్నాను," అన్నాడు అలీనూర్ జాఫర్‌తో. ఇందుకు జాఫర్ సమ్మతించాడు.

వారు బాగ్దాదు చేరగానే జాఫర్ ఖలీఫాతో జరిగినదంతా చెప్పాడు. ఖలీఫా అంతా విని, అలీనూర్‌కేసి తిరిగి, "అలీనూర్, నీకు ద్రోహం చేసిన ఈ సావీ తల నీచేత్తోనే ఖండించు!" అని ఆజ్ఞాపించాడు. అలీనూర్ కత్తిదూసి సావీని సమీపించాడు.

"అలీనూర్, నేను దుర్మార్గ ప్రవృత్తి గలవాణ్ణి. నా ప్రవృత్తికి అనుగుణమైన పనులు చేశాను. నువ్వు మంచివాడివి, అందుచేత నీ ప్రవృత్తికి అనుగుణంగా ప్రవర్తించు!" అన్నాడు సావీ.

ఈ మాట వినగానే అలీనూర్ చేతినుంచి కత్తి కింద పడిపోయింది. అలీనూర్ సజ్జనత్వాన్ని అందరూ కొనియాడారు. ఖలీఫా సుల్తానునూ, సావీనీ క్షమించక తప్పిందికాదు.

తరవాత ఖలీఫా అలీనూర్‌ను కొన్నాళ్లు తనవద్ద ఉంచుకుని చివరకు అంతులేని బహుమానాలతో బస్రాకు పంపేశాడు. అలీనూర్ ప్రియసఖిని వెంటబెట్టుకుని బస్రాకు వెళ్ళి అక్కడ సుల్తానుగా చాలాకాలం పరిపాలించాడు. (అయిపోయింది)





# ఉప్పుకషాయం

ఒక గ్రామంలో ఒక అసామి ఉండేవాడు. అయన కొక కొడుకూ కూతురూ ఉండేవారు. కాలక్రమాన కొడుకుకు పెళ్లి అయి కోడలు కాపరానికి వచ్చింది. దాంతో ఇంట్లో ముగ్గురు ఆడవారయారు—అసామి భార్యా, కూతురూ, కోడలూ.

ముగ్గురాడవాళ్ళు ఒక కొంపలో ఉన్నప్పుడు కొంపలో ఏదో ఒక అవకతవక జరుగుతూనే ఉంటుంది. ఈ ఇంటో ఇద్దరాడవాళ్లు తల్లి కూతుళ్లే గనక వారిద్దరి పద్ధతులూ ఇంచుమించు ఒకటిగానే ఉండేవి. పోతే కోడలు పరాయిపిల్ల. ఆమె అలవాట్లు వేరు, ఆమె పనులు చేసే తీరుకూడా వేరే. అందుచేత ఆ పిల్లను తమ పద్ధతులకు మార్చటానికి తల్లి కూతుళ్ళు చాలా శ్రమపడుతూ ఉండేవారు. కోడలు గనక ఆమెకు చెప్పినా తెలియదన్నట్టుకూడా భావించి, చెప్పిన విషయాలే మళ్ళీమళ్ళీ చెబుతూండేవారు.

ఒకరోజు అసామి బావమరిది చుట్టపుచూపుగా వచ్చాడు. అపకతవకలు జరిగితే తన అన్న ఏమనుకునిపోతాడో అని అసామి భార్య ప్రత్యేకంగా జాగర్తపడసాగింది. ఆవిడ బిందె తీసుకుని బావికి వెళుతూ కోడలితో, "ఏమే, పొయిమీద పులుసు కాగుతున్నది గాని అందులో గుప్పెడు ఉప్పు వెయ్యి. మళ్ళీ మరచిపోగలవు జాగర్త!" అని వెళ్ళింది.

రెండు రోజులక్రితం కోడలు పులుసులో ఉప్పువెయ్యటం మరిచిపోయింది. ఆ సంగతి కోడలికి జ్ఞాపకంచేసే ఉద్దేశంతో అత్తగారు అలా అన్నది.

చేతిలో పని అయిపోగానే కోడలు పులుసు కళాయిలో ఇంత ఉప్పు వేసి వేరే పని చూసుకోబోయింది.

మరి కాస్సేపటికల్లా ఆడబిడ్డ పిడకలు గోడకు కొట్టటం ముగించి చేతులు కడు

బి. శకుంతల

క్కని వంటఇంటోకి వచ్చి పొయిమీద కాగుతున్న పులుసు చూచింది.

"ఆ తెలివితక్కువమొద్దు ఎలాగూ పులుసులో ఉప్పువెయ్యటం మరిచిపోతుంది. ఆవిడ తరహా నాకుతెలుసు! మామయ్య వచ్చాడుకూడానూ!" అనుకుని ఆమె ఒక పిడికెడు ఉప్పు తీసి పులుసులో వేసి గొడ్లకు మేత వెయ్యబోయింది.

ఇంతలో అత్తగారు నీళ్ళబిందెతో తిరిగి వచ్చి పొయిమీద పులుసు చూసి, "ఆ మొద్దుకు మళ్ళీమళ్ళీ జ్ఞాపకం చేయ్యటం కంటె నేనే చేసుకోవటం నయం!" అంటూ ఒక గుప్పెడు ఉప్పుతీసి పులుసులో వేసేసింది.

మధ్యాన్నం ఆసామీ, ఆయన బావమరిదీ భోజనాలకు కూచున్నప్పుడు, బావమరిది ముందుగా పులుసుముద్ద నోట్లో పెట్టుకుని, "ఇదేమిట్రా, ఇందులో ఉప్పు వెయ్యటం మరిచారా ఏమిటి?" అన్నాడు.

వెంటనే ఆసామి భార్య, "అదేమిటన్నయ్యా, నేను పులుసులో ఉప్పువేశానే?" అన్నది ఆశ్చర్యంగా.

వెంటనే కూతురు, "నేను పిడికెడు ఉప్పు వేశానమ్మా!" అన్నది.

"మీరు ఉప్పు వెయ్యటం మరవద్దన్నారుగా, అందుకని నేనూ వేశానత్తయ్యా!" అన్నది కోడలు.

"అలా చెప్పండి! అందుకే పులుసు ఉప్పుకషాయమయింది!" అన్నాడు ఆసామి బావమరిది నవ్వుతూ.

తన ఇంటి ఆడవాళ్ళమధ్య ఐక్యత లేక పోవటం చూసి ఆసామికి కోపం వచ్చింది.

"ఇకనుంచీ ఈ ఇంట్లో మీరు ఎవరి పనులు వారు చేసుకోవలసిందే గాని, ఒకరి పనులు ఒకరు చెయ్యటానికి వీల్లేదు!" అని శాసించాడు.

అంతటితో ఆ ఇంట జరిగే అవకతవక లన్నీ నిలిచిపోయాయి.





# దౌర్భాగ్యం

ఒక ఊళ్లో ఇద్దరు అన్నదమ్ములుండేవారు. వారు పెళ్ళిళ్లు చేసుకుని తమ తండ్రి ఆస్తిని సమంగా పంచుకుని వేరువేరు కాపరాలు ఏర్పాటు చేసుకున్నారు. అయితే కొద్దికాలం లోనే వారి అదృష్టాలు కూడా వేరయి పోయాయి. పెద్దవాడికి కుచేల సంతానం లాగా ఏటా పిల్లలు కలిగారు, ఆస్తి యావత్తూ పోయింది. రెండోవాడికి రోజులు కలిసివచ్చాయి, అతను సంపన్నుడయాడు.

చివరకు పెద్దవాడి పరిస్థితి భయంకరంగా పరిణమించింది. అతనికీ, భార్యకూ, పిల్లలకూ కట్టుకునేటందుకు సరిగా గోచి పాతలుకూడా లేవు. వారికి ఏ పూటా కడుపునిండా గంజికూడా లేదు.

ఈ పరిస్థితిలో పెద్దవాడు అభిమానం చంపుకుని తమ్ముడి దగ్గిరికి వెళ్ళి, "తమ్ముడూ, నేనూ పిల్లలూ పస్తులతో మల మల మాడిపోతున్నాం. దేవుడి దయవల్ల నీ కింత ఉన్నది గనక నాకు తోచిన సహాయం చెయ్యి. నాకింకెవరూ గతి లేరు!" అని ప్రాధేయపడ్డాడు.

రెండోవాడు కొంచెంసేపు ఆలోచించి, "సహాయం చెయ్యటానికేంగాని, ప్రస్తుతం నేనుకూడా పెద్ద ఖర్చు మీద వేసుకున్నాను. రేపు నా పుట్టినరోజు పండగ. అందుకని బ్రహ్మాండంగా విందొకటి ఏర్పాటుచేసి గొప్ప గొప్ప వారందరికీ ఆహ్వానాలు పంపాను. గొప్పవారిని పిలవనేగూడదు, పిలిచాక వారి హోదాకు తగ్గట్టు ఆతిథ్యం ఇచ్చితీరాలి. ఎంత ఖర్చున్నదో నువే ఆలోచించు. ఈ పబ్బం గడిచాక చేతిలో మిగిలితే తృణమో, పణమో నీచేతిలో పెట్టటానికి నాకేమీ అభ్యంతరంలేదు. రేపు విందుకు నువ్వూ, వదినా, పిల్లలూ తప్పక రండి. ఈ సంగతి సందర్భాలన్నీ అప్పుడు వివరంగా మాట్లాడుకుందాం!" అన్నాడు.

జి. ఆంజనేయశర్మ



"నువ్వు వైభవంగా పుట్టినరోజు పండగ చేసుకుంటూంటే చింకిపాతలతో మేంకూడా దేనికిలే!" అన్నాడు అన్న.

"అదేంమాట? పేదరికం వచ్చినంత మాత్రాన మనం ఒక తల్లిపిల్లలం కాక పోతామా?" అన్నాడు తమ్ముడు.

అన్న పరమానందంతో ఇంటికి వెళ్లి తన భార్యతో, "రేపు మా తమ్ముడి పుట్టినరోజు. విందు జరుగుతున్నది. మనని దానికి రమ్మని ఆహ్వానించాడు," అన్నాడు.

"ఇంకా నయం! ఈ చిరుగుల బొంతలతో వెళితే మనని చూసి అందరూ నవ్వుతారు," అన్నది భార్య.

"పిలిచినప్పుడు వెళ్లకపోవటం బాగుండదు. మన స్థితి లోకానికి తెలియదా?" అన్నాడు భర్త.

మర్నాడు అన్న కుటుంబం తమ్ముడి ఇంటికి వెళ్లారు. ఇల్లంతా సంపన్నులైన అతిథులతో కళకళలాడుతున్నది. ఆ ఉత్సాహంలో అన్నను, అతని భార్యనూ, పిల్లల్నీ గమనించినవారులేరు, ఆదరించినవారులేరు. ఆఖరుకు నౌకర్లుకూడా వారికేసి చూడలేదు. భోజనాలకు కూచునేటప్పుడైనా వారి నెవరూ పిలవలేదు. కడపం క్తినకూడా వారికి చోటు లేకపోయింది.

అన్న ఆశ నిరాశగా మారింది. అయినా, అయన కుటుంబమూ కలిసి మాడుతున్న డొక్కలతో ఇంటికి బయలుదేరి వచ్చేశారు. దారిలో ఒక దౌర్భాగ్యుడు వారి వెనకే నడుస్తూ వచ్చాడు.

"మన వెనకగా ఎవరో నడిచి వస్తున్నారు. ప్రపంచమంతా మనను వదిలేస్తే వీడు మనవెంట పడ్డాడేమిటి?" అన్నది భార్య విసుగ్గా.

"వాడు మన దౌర్భాగ్యం అయి ఉంటాడు!" అన్నాడు భర్త.

అది నిజమే. ఆ మనిషి వాళ్ల దౌర్భాగ్యమే. అదివరలో వాళ్ళు వాణ్ణి చూడలేదు

గాని, వాడుమాత్రం వాళ్ళని చాలాకాలంగా వెన్నంటే ఉంటున్నాడు.

మర్నాడు అన్న ఇంట్లోనుంచి బయటికి రాగానే వాకిలి దగ్గిర కూచుని దౌర్భాగ్యం కనపడ్డాడు.

"చూడు, ఈ లోకంలో ఏమీ సుఖం లేదు. ఎందుకు విచారిస్తావు, వెళ్లి సారాయి తాగి ఆనందించుదాం పద!" అన్నాడు దౌర్భాగ్యం అన్నతో.

"దానికి నాదగ్గిర డబ్బులేదే!" అన్నాడు అన్న నిరుత్సాహంగా.

"నీ పాత గొంగళీ అమ్ము. చలికాలం వెళ్లిపోయింది గద! మళ్ళీ చలికాలం వచ్చే దాకా బతికి ఉంటే చూసుకోవచ్చులే!" అన్నాడు దౌర్భాగ్యం.

అన్న లోపలికి వెళ్లి పాతగొంగళి తెచ్చాడు. దాన్ని అమ్మగా వచ్చిన డబ్బులతో ఇద్దరూ తాగారు.

అది మొదలు అన్న ఇంటో ఉన్న ఒక్కొక్క వస్తువే అమ్ముతూ ఆ డబ్బుతో తాగసాగాడు. దౌర్భాగ్యం రాత్రింబగళ్ళు తన వెంటే ఉంటున్నాడు. తనను మరింత గోతిలోకి తోస్తున్నాడు.

ఈ సంగతి అన్నకు తెలిసికూడా ఏమీ చేయులేకపోయాడు.



కాని చిట్టచివరకు అన్నకు ఏమీ మిగల లేదు. ఇక అమ్మటానికి ఏమీ లేదు. ఎక్కడ నన్నా కూలిచేసి రెండు డబ్బులు తెద్దామని అన్న అనుకున్నా దౌర్భాగ్యం నిరుత్సాహ పరుస్తూ ఉండేవాడు.

"ఈ దౌర్భాగ్యానికి ఎదురుతిరిగితే తప్ప నేను బాగుపడను," అని చివరకు అన్న తీర్మానించుకున్నాడు.

ఒకనాడు వారిద్దరూ పొలాల మధ్యగా నడిచి వస్తుండగా ఒక బీడులో చాలా పెద్ద రాయి కనపడింది.

"ఇక్కడ ఎక్కడా కొండలు లేవే, ఇంత రాయి ఇక్కడికి ఎలా వచ్చింది?

ఎవరో కష్టపడి తెచ్చి ఉంటారు. ఒకవేళ దీనికింద ఏదైనా నిధి పాతిపెట్టారేమో!" అన్నాడు అన్న.

"నీదంతా భ్రమ! ఇక్కడ నిధి ఎందు కుంటుంది? ఉంటే అది నీకంటా, నా కంటా పడుతుందా? మన మొహాలకు అంత అదృష్టంకూడానా?" అన్నాడు దౌర్భాగ్యం.

కాని అన్న ఇక వాడిమాటలు వినదలచ లేదు; వెంటనే గ్రామానికి వెళ్లి ఒకరైతు దగ్గిర ఎద్దులబండి అరువు తీసుకుని రాయి ఉన్న చోటికి వచ్చాడు.

దారిపొడుగునా దౌర్భాగ్యం నిరుత్సాహ పరుస్తూనే ఉన్నాడు. కాని అన్న వాడి మాటలు వినిపించుకోలేదు.

రాయిదగ్గిర బండి ఆపి దిగి, అన్న దౌర్భాగ్యంతో, "ఒక పట్టు పట్టు, ఈ రాతిని పక్కకు తోద్దాం!" అన్నాడు. ఇద్దరూ కలిసి రాతిని ఒక పక్కకు ఒరగదోశారు. అన్న అనుకున్నట్లే ఆ రాతికింద చిన్న గొయ్యి ఉన్నది. దానినిండా బంగారు కాసు లున్నాయి. ఇద్దరూ ఆ బంగారాన్ని తోడి బండిలో పోశారు.

"ఇంకా ఏమైనా మిగిలిఉందేమో చూడు!" అన్నాడు అన్న.

"చూడక్కర్లేదు. ఇంకేమీ లేదు," అన్నాడు దౌర్భాగ్యం.

"గోతిలోకి దిగి జాగర్తగా వెతుకు. రెండు మూడు కాసులు మిగిలిపోయా యేమో, వాటినిమాత్రం ఎందుకు పోని వ్వాలి?" అన్నాడు అన్న.

దౌర్భాగ్యం ఇష్టం లేకుండానే గోతిలోకి దిగి, వంగి లోపల తడుపుతూన్న సమ యంలో అన్న రాతిని యథాస్థానంలోకి తోసి, బండి ఎక్కి ఇంటికి వచ్చేశాడు. ఆయనకు దౌర్భాగ్యం పీడ వదిలిపోయింది.

ఆ తరవాత ఆయన ఏ కష్టాలూ లేకుండా భార్యాబిడ్డలతో సుఖంగా జీవించాడు.






## 11

[ట్రోయ్‌యుద్ధం ముగిసినాక తన స్వదేశమైన ఇథకాను చేరుకోవటానికి బయలుదేరిన రూపధరుడు అనేక ఏళ్లపాటు చెప్పరాని కష్టాలు పడి, అపాయాలను ఎదుర్కొని, తన అనుచరులనందరనూ కోల్పోయి, ఒంటరిగా స్వదేశానికి చేరాడు. కాని ఇంకా అతని కష్టాలు తీరలేదు. అతని ఇష్టదేవత అయిన బుద్ధిమతీదేవి అతని క్షేమం కోరి రూపధరుడి రూపాన్ని పూర్తిగా మార్చి వృద్ధుడిలాగా కనపడేటట్టు చేసింది. ఈలోపుగా ఇథకాలో—]

ట్రోయ్‌యుద్ధంనుంచి గ్రీకులు తిరిగివచ్చినాక రూపధరుడు దారిలో మరణించాడని వదంతి పుట్టింది. ఇథకాలోనూ, దాని పరిసరాలలో ఉన్న దీవులలోనూ గల రాజకుమారులు నూటపన్నెండుమంది రూపధరుడి ఇంటిపై వచ్చిపడ్డారు. రూపధరుడి భార్య అయిన పద్మముఖిని పెళ్లాడి ఇథకాకు రాజు కావటమే వారిలో ప్రతిఒక్కడి ఆశయమూనూ.

ధీరమతి అప్పుడే యౌవనం పొడచూపుతున్న కుర్రవాడు. అతను పసివాడుగా ఉండగానే రూపధరుడు యుద్ధానికి బయలుదేరి వెళ్లాడు. అందుచేత ధీరమతి తన తండ్రిని బొత్తిగా ఎరగడు. అయితే అతను తన తండ్రి రాకకోసం ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు. ఆయనను గురించి ఏ వార్తా లేకపోవటం అతనిని చాలా బాధించింది. "ఆయన పోయినట్టు నమ్మకంగా

గ్రీకు పురాణగాథ

తెలిసినా బాగుండును. మా అమ్మ ఎవరినో ఒకరిని పెళ్లాడేస్తుంది," అనుకున్నాడతను.

ప్రస్తుతం ఈ రాజకుమారులందరూ ధీరమతిని అసహాయుడికింద కట్టేసి, అతని ఇంట తిష్ఠవేసి, రూపధరుడి పశుగణాలను కోసుకు తిని విందులు ఆరగిస్తూ, తాగి తందనాలు వేస్తూ, పద్మముఖి నాభార్య అంటే నా భార్య అని ప్రగల్భాలు పలుకుతున్నారు. వారిని ఎలా వదిలించుకోవాలో ధీరమతికి తెలియలేదు.

ఇక, పద్మముఖికి తన భర్త తిరిగి వస్తాడని గట్టి నమ్మకం. రూపధరుడు చచ్చిపోలేదనీ, అతను తిరిగి వస్తాడనీ జోస్యం ద్వారా ఆమె తెలుసుకుని ఉన్నది. అందుచేత ఆమె తిరిగి పెళ్లాడ నిరాకరించింది. కాని ఆమెను కోరివచ్చిన రాజకుమారులు రూపధరుడు చనిపోయాడని చెప్పి ఆమెను పెళ్లికి తొందర చేయసాగారు. వారిని తప్పించుకొనటానికి ఆమె ఒక యుక్తి పన్నింది; "నేను మా మామగారి శవంపై కప్పటానికి ఒక బట్ట నేస్తున్నాను. అది పూర్తి కాగానే స్వయంవరం చేసుకుంటాను," అన్నది. రాజకుమారులు సరేనన్నారు.

అది మొదలు పద్మముఖి రోజూ పగలల్లా బట్ట నేయుటమూ, రాత్రివేళ నేసినదంతా విప్పదీయుటమూ చేస్తూ రాసాగింది. ఇలా





మూడేళ్లు సాగినాక రాజకుమారులు ఆమె చేసిన మోసం పట్టేశారు. వారి దౌర్జన్యం మితిమీరసాగింది.

ఇది చూసి ధీరమతి ఒక నిర్ణయానికి వచ్చాడు. అతను పైలాస్‌కు వెళ్లి నవ ద్యోతుణ్ణీ, స్పార్టాలో ప్రతాపుణ్ణీ కలుసుకుని తన తండ్రి వార్తలు తెలుసుకుందామను కున్నాడు. అందరికన్న ఆఖరుకు ఇల్లు చేరినవాడు ప్రతాపుడు; అందుచేత ఆయనకు తన తండ్రి వృత్తాంతం కొంతఅయినా తెలిసి ఉండవచ్చు.

"మా తండ్రి పోయినట్టు తెలిస్తేఆయనకు ఉత్తరక్రియలు చేసి మా అమ్మకు స్వయం వరం జరిపిస్తాను. అంతేగాని ఈ దుర్మార్గు లను ఇక ఎంతమాత్రమూ సహించను. నా యీడు యువకులు ఎంతో శౌర్య పరా క్రమాలు చూపిస్తున్నారు. మా తండ్రి బతికే ఉన్న పక్షంలో, యింటచేరిన ఈ దుర్మార్గుల నందరినీ ఏదోవిధంగా కడతేర్చుతాను!" అనుకున్నాడు ధీరమతి.

ఈ విధంగా నిర్ణయించుకున్నవాడై ధీర మతి ఆ రోజు రాజకుమారులతో, "అయ్యా లారా, మీరంతా మా అమ్మను పెళ్లాడగోరు తున్నామంటున్నారు, బాగానే ఉంది గాని, మీ ప్రవర్తన నా కెంతమాత్రమూ నచ్చలేదు. రేపు రచ్చబండలో సమావేశం జరిపి,





మీరంతా నా ఇంట్లో నుంచి వెళ్ళిపోవాలని బహిరంగంగా మిమ్మల్ని కోరబోతున్నాను. మీ ఇళ్లలో తినండి, తాగండి. ఇక్కడే మీ అగడాలు సాగించదలిచిన పక్షాన మీరు నిర్మూలమై పోగలరు!" అని హెచ్చరించాడు.

అకస్మాత్తుగా ఆ కుర్రవాడు ప్రదర్శించిన సాహసం చూసి ఆ దుర్మార్గులందరూ ఆశ్చర్యపడ్డారు.

మర్నాడు తెల్లవారగానే ధీరమతి చాటింపు వేసేవారిని పిలిచి, రచ్చబండలో పౌరులందరూ సమావేశం కావలిసిందిగా చాటించి రమ్మని ఉత్తరువిచ్చాడు. అతను రచ్చబండవద్దకు ఒక బల్లెం చేతబట్టి, రెండు కుక్కలను వెంటబెట్టుకుని, దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వెళ్లాడు. అక్కడ చేరిన పెద్దలు ధీరమతిని అతని తండ్రి కూర్చుంటూ ఉండిన అగ్రస్థానంలో కూచోనిచ్చారు.

అందరూ ఎవరిస్థానాలలోవారు కూచోగానే చాలా వృద్ధుడైన ఐగుప్తుడు లేచి మొదట మాట్లాడాడు. ఈయన కుమారులలో ఒకడు రూపధరుడి అనుచరుడు, ఫాలలోచనుడు చంపితిన్నవారిలో ఒకడు. ఈయన మరొక కుమారుడు పద్మముఖిని పెళ్లాడగోరే రాజ కుమారులలో ఉన్నాడు. ఈ వృద్ధుడు లేచి నిలబడి, "నాయనలారా, ఈ సమావేశం ఏర్పాటుచేసినవా రెవరోగాని, చాలా మంచి పని చేశారు. ఎందుకంటే రూపధరుడు యుద్ధానికి వెళ్లాక ఇథకాలో ప్రజలు సమావేశం కానేలేదు. ఇవాళ మనం ఎందుకు సమావేశమయామో నాకుకూడా తెలుసు కోవాలని ఆత్రంగా ఉంది!" అన్నాడు.

వృద్ధుడి మాటలు ధీరమతిని ఉత్సాహ పరిచాయి. అతను లేచి నిలబడి, "అయ్యా, ఈ సమావేశాన్ని ఏర్పరచినది నేనే. కేవలం నా సొంత కష్టాలు చెప్పుకొనటానికే మిమ్మల్ని ఆహ్వానించాను. నా ఇంటికి రెండు కష్టాలు దాపరించాయి. నేను ప్రసిద్ధుడైన నా తండ్రిని పోగొట్టుకున్నాను; ఆయన



ఒకప్పుడు మీ అందరికీ రాజు. అంతకంటె కూడా పెద్ద ఉపద్రవం మరొకటి వచ్చి పడింది; మా అమ్మను పెళ్లాడే ఉద్దేశంతో అనేకమంది వచ్చి మా యింటిపై బడి మా ఇల్లు గుల్లచేస్తున్నారు. త్వరలోనే నేను సర్వనాశనమైపోతానని భయంగా ఉన్నది. ఈ పని చేస్తున్నవారిలో ఇక్కడ చేరినవారి కుమారులు కొందరున్నారు. మా తాతగారి వద్దకు వెళ్లి మా అమ్మనిచ్చి వివాహంచెయ్యమని అడగటానికి వారికి ధైర్యం చాలదు. అందుచేత మా ఇంట చేరి మా పశువులను చంపి తింటూ, మా సారా తాగుతూ, యథేచ్ఛగా తందనాలు చేస్తున్నారు. మా నాన్నగారు లేని కారణంచేత మా యిల్లు కుక్కలదొడ్డి అయిపోయింది. మా నాన్నగారు మన దేశానికి ఏమి ద్రోహం చేశాడని మేమీ శిక్ష అనుభవిస్తున్నామో నాకు తెలియటంలేదు. ఇది మీ అందరికీకూడా తలవంపులైన విషయమే!" అన్నాడు.

వెంటనే దుర్బుద్ధి అనేవాడు లేచి, "ధీరమతీ, నీవు చేసిన ఆక్షేపణకు అర్థం లేదు. తప్పంతా మీ అమ్మది అయి ఉండగా మమ్మల్ని దుయ్యబడతా వెందుకు? మూడేళ్లుగా మీ అమ్మ మమ్మల్నందరినీ మోసగించింది. ఆమె మాలో ప్రతి ఒక్కడికీ




ఏదోవిధంగా ఆశ చూపెట్టింది. బట్ట నేయుటం పూర్తికాగానే స్వయంవరం చేసుకుంటానన్నది. మూడేళ్లు వెళ్లి నాలుగోఏడు నడుస్తున్నది. ఆ బట్ట నేయుటం పూర్తికాదు. రాత్రి పూట దివిటీ పెట్టుకుని, పగలు నేసినదంతా విప్పుతుంటే ఎలా పూర్తి అవుతుందీ? ఆమెను పెళ్లాడగోరేవారి తరఫున నేను చెబుతున్నాను విను. ఆమెను నీ యింటినుంచి పంపేసి తన ఇష్టంవచ్చినవాణ్ణి పెళ్లాడమను. ఆమె ఇలాగే మమ్మల్ని మోసగించ దలిచినట్టయితే, ఆమె ఎవరినో ఒకరిని పెళ్లాడినదాకా మేము నీ యిల్లు వదిలేదిలేదు. ఇది ముమ్మాటికీ నిజం!" అన్నాడు.





"నేను నా కన్నతల్లిని ఇల్లువెళ్లగొట్టటం ఎన్నటికీ జరిగేపని కాదు. అదీగాక ఆమె తన తండ్రివద్దనుంచి తెచ్చుకున్న భరణాన్ని తిరిగి ఇచ్చే స్థితిలోకూడా లేను," అన్నాడు ధీరమతి.

ఇంకొక వృద్ధుడు లేచి, "రూపధరుడు యుద్ధానికి బయలుదేరి వెళ్లేటప్పుడే నేను జోస్యం చెప్పాను. బయలుదేరిన ఇరవై సంవత్సరాలకు అతను చాలా కష్టాలుపడి తిరిగివస్తాడని చెప్పాను. ఇప్పటిదాకా నేను చెప్పినది అక్షరాలా జరుగుతున్నది. అతని ఇంట చేరినవారికి రాబోయేవి చాలా చెడ్డ రోజులు!" అన్నాడు.

"నీ జోస్యాలు నీ కొడుకులకు చెప్పుకో. మాకు నీ బెదిరింపులు లక్ష్యంలేదు. రూపధరుడే తిరిగివచ్చినా మమ్మల్ని తన ఇంటనుంచి వెళ్లగొట్ట సాహసించలేడు," అని ఇంకొకడు ప్రగల్భాలు పలికాడు.

చివరకు ధీరమతి, "నేను చెప్పవలసిన మాట చెప్పేశాను. దయచేసి నాకు ఒక నౌకా, ఇరవైమంది నావికులూ ఇప్పించినట్టయితే నేను స్పార్టాకూ, పైలాస్‌కూ వెళ్లి నా తండ్రివార్త తెలుసుకుని వస్తాను. ఆయన బతికి ఉన్నట్టు తెలిస్తే ఇంకొక్క ఏడాదిపాటు ఈ దుర్మార్గాన్ని సహిస్తాను. అలా కాక మా తండ్రి పోయాడని రూఢిగా తెలిస్తే



ఆయనకు ఉత్తరక్రియలు జరిపి మా అమ్మ పెళ్లి నేనే ఏర్పాటుచేస్తాను !" అన్నాడు.

సమావేశం ముగియగానే ధీరమతి ఇంటికి వెళ్లక సముద్రతీరానికి వెళ్లాడు. అక్కడ అతనికి సహనుడు అనేఆయన కన్పించాడు. ఈ సహనుడు రూపధరుడికి మొదటినుంచీ ఆప్తమిత్రుడు. ఆయన ధీరమతిని చూసి, "నాయనా, ఇవాళ నిన్ను చూసి నాకు చాలా ఆనందమయింది ; ఆ తండ్రికి కొడుకు వనిపించావు. ఇథకాలో చాలా నౌకలున్నాయి. అన్నిటిలోకీ ఉత్తమమైన నౌకగా చూసి నీ ప్రయాణానికి సంపాదించి పెడతాను. ప్రయాణానికి కావలిసిన నావికులనుకూడా నేనే పోగుచేసుకు వస్తాను. నువుమాత్రం ఇంటికి వెళ్లి ప్రయాణసంబారాలన్నీ పట్టించుకుని రా !" అన్నాడు.

ధీరమతి వెంటనే ఇంటికి వచ్చాడు. అతనిని చూడగానే అతని కొంప గుల్ల చేస్తున్న దుర్మార్గులందరూ ఒకచోటచేరి వేళాకోళం సాగించారు.

"అమ్మ బాబోయ్, వీడు మన రక్తం తాగాలని చూస్తున్నాడురోయ్. ఇంతకాలమూ ఏమిటో అనుకున్నాం !" అన్నాడొకడు.

"వీడు పైలాస్, స్పార్టాలకు పోవటం ఎందుకో తెలుసా ? సైన్యాలను తీసుకురావటానికి !" అన్నాడు ఇంకొకడు.





"లేక ఇంత విషం తెచ్చి మన సారాయిలో కలిపేస్తాడో!" అన్నాడు మూడోవాడు.

"వాళ్ల నాన్నలాగే సముద్రాలమీద అదే పోత పోతాడేమో, అదికూడా ఆలోచించండి. వీడి ఆస్తి పంచుకోలేక మనం చావాలి!" అన్నాడు నాలుగోవాడు.

ధీరమతి వారి మాటలు పట్టించుకోక సామానుకొట్టువద్దకు వెళ్లి తనను పెంచిన దాసితో తన ప్రయాణానికి కావలిసిన సంబారాలన్నీ సిద్ధంచేసి ఉంచమన్నాడు.

"నువ్వు వెళ్లకు, నాయనా! నువ్వుకూడా సముద్రాలమీద పోతే మీ అమ్మ వింకాను! ఈ ఆలోచన నీకెందుకు కలిగింది, నా తండ్రీ?" అని ముసలిది శోకాలుపెట్టింది.

"పెద్దమ్మా, ఇది దైవనిర్ణయం. నువ్వు అడ్డాలు చెప్పకు. ఈ రాత్రి మా అమ్మ నిద్రపోయాక బయలుదేరి పోతాను. ఆవిడ అడిగితే తప్ప నా ప్రయాణంగురించి చెప్పనని ఒట్టువెయ్యి! ప్రయాణానికి కావలిసిన తిండీ మొదలైనవన్నీ సిద్ధంగా ఉంచు!" అన్నాడు ధీరమతి.

ఈలోగా సహనుడు వీధులన్నీ తిరిగి ప్రయాణానికి అవసరమైన నావికులను ఏరి సముద్రతీరానికి పంపాడు. మంచి నౌక కూడా దొరికింది. ఇంతలో పొద్దూకిపోయింది. రూపధరుడి ఇంట అందరూ తిని తాగి నిద్రలకు పడ్డారు. ఆ సమయాన సహనుడు వచ్చి ధీరమతితో, "నాయనా, ప్రయాణానికి సర్వమూ సిద్ధంగా ఉన్నది. నువ్వు రావటమే ఆలస్యం!" అన్నాడు.

ఇద్దరూ కలిసి సముద్రతీరానికి వెళ్లారు. నావికులు ప్రయాణసంబారాలను రూపధరుడి ఇంటినుంచి తెచ్చి నౌకలోకి ఎక్కించారు. ధీరమతి నౌకలో ఎక్కాడు. నావికులు తెరచాప ఎత్తి, లంగరు పైకి లాగారు. అనుకూలమైన గాలి కొడుతున్నది. నౌక పైలాస్‌కు బయలుదేరింది.

—[ఇంకా ఉంది]





# బాగుపడిన పాలేరు

పూర్వం రైతుకూలీ ఒకడుండేవాడు. వాడికి ముగ్గురు కొడుకులు. పెద్దకొడుకు షావుకారు గారింట పాలేరుగా పని చెయ్యటానికి కుదిరాడు.

"ఒరే, నువు కోడి కూయగానే లేచి పని ప్రారంభించాలి. లేకపోతే నిన్ను పనిలో ఉంచుకునేది లేదు," అని షావుకారు తన పాలేరుతో ముందుగానే చెప్పాడు.

పాలేరుకూడా ఆ ప్రకారమే రోజూ కోడి కూయగానే లేచి పనిలోకి పోతూవచ్చాడు. మూడురోజులు గడిచాక నాలుగోరోజు వాడు కోడికూతకు లేవలేదు. ఆ రోజే షావుకారు తన పాలేరును పని మానిపించి, చిల్లిగవ్వ కూడా ఇవ్వకుండా పంపేశాడు.

తరవాత షావుకారు దగ్గిర పనిచేసేందుకు రెండోవాడు వచ్చాడు. వాడు వారం రోజులు ఓపికతో పనిచేశాడు. కాని ఆ తరవాత వాడికీ అదే గతి పట్టింది.

చిట్టచివరకు మూడోవాడు పాలేరుగా వచ్చాడు. తన అన్నలు షావుకారుచేత ఎలా మోసపోయారో వాడికి తెలుసు. షావుకారుకు బుద్ధిచెప్పటానికే వాడు పనిలోకి వచ్చాడు.

షావుకారు మామూలు అలవాటుప్రకారం తన కొత్తపాలేరుతో, "ఒరే, నువు ప్రతిరోజూ కోడి కూసేసరికల్లా లేచి పనిలోకి రావాలి. అలా చెయ్యకపోతే నిన్ను ఒక్క క్షణంకూడా పనిలో ఉంచుకోను. లేచింది మొదలు చీకటి పడేదాకా వళ్లు వంచి పనిచేయాలి," అన్నాడు. "దానికేం అభ్యంతరం?" అన్నాడు కొత్తపాలేరు.

"అయితే నీ జీతం మాట చెప్పు," అన్నాడు షావుకారు.

"నాకేమంత ఆశ లేదులెండి. ఏడాది పనిచేసినాక మిమ్మల్ని ఒక్కగుద్దు గుద్దుతాను, యజమానురాలిని ఒక్కగిచ్చు గిచ్చుతాను. అంతే!" అన్నాడు పాలేరు.

ఎస్. సుందర్రావు

"వీడు వట్టి పిచ్చిముండాకొడుకల్లే ఉన్నాడు!" అని షావుకారు పాలేరును చూసి తనలో తాను నవ్వుకుని, వాడు అడిగినదానికి సమ్మతించాడు.

ఆ రోజల్లా పనిచేసి పొద్దూకగానే సావిట్లో పడుకోవటానికి పోతూ, పాలేరు కోడిపుంజును పట్టుకుని, దాని తల రెక్కకిందికి పంచి కట్టి తన మానాన తాను నిద్రపోయాడు.

భల్లున తెల్లవారినా కోడి కూయలేదు. పాలేరు లేచి యజమాని దగ్గిరికి వెళ్ళి, "జాముపొద్దెక్కినా కూయదేమిటో మాయదారి కోడి! నాకింత బువ్వ పెట్టించండి, నేను పనిలోకి పోవాలి!" అన్నాడు.

కోడి ఎందుకు కూయలేదో షావుకారుకూ అర్థంకాలేదు. "ఒరే, మనం బస్తీకి పోదాం పద!" అన్నాడు. ఇంకొక కోడిని కొనుక్కు వద్దామని ఆయన ఉద్దేశం.

ఇద్దరూ బస్తీకి పోతూండగా దారిలో వారికొక పోట్లఎద్దు ఎదురయింది. నలుగురు మనుషులు తాళ్ళుపట్టుకుని బిగలాగుతున్నా అది ఆగకుండా ఉన్నది.

"ఎక్కడికి పోతున్నారు, బాబుల్లారా?" అన్నాడు పాలేరు ఆ మనుషులతో.

"వట్టి పొగరబోతు ఎద్దు! ఎక్కడైనా అమ్ముదామని తీసుకుపోతున్నాం. ఎవరూ



కొనకపోతే కసాయివాడికి వప్పగిస్తాం, అంతే!" అన్నారు వాళ్ళు.

"మంచిగొడ్డు కొక దెబ్బ!" అంటూ పాలేరు ఎద్దు తలమీద తన పిడికిలితో ఒక్క గుద్దు గుద్దాడు. వెంటనే అంత ఎద్దూ చచ్చి పడిపోయింది.

దాని తాలూకు మనుషులు, "పీడా విరగడయింది! కాని ఎటూ కానిచోట చచ్చిందిగదా, దీని చర్మమైనా దక్కితే బాగుండును!" అన్నారు.

"అదేమంత భాగ్యం!" అంటూ పాలేరు ఎద్దుచర్మాన్ని తన రెండు వేళ్ళమధ్య గట్టిగా పట్టి లాగాడు.

వెంటనే చర్మం యాపత్తూ అరటిపండు తొక్కలాగా ఊడి వచ్చింది.

తన పాలేరు గుద్దు ఎలాటిదో, గిచ్చు ఎలాటిదో షావుకారుకు ఇప్పు డర్థమయింది. ఆయనకు ముచ్చెమటలు పోయసాగాయి.

"బస్తీకి మరొకసారి పోవచ్చులేరా! ఇవాళకు ఇంటికి పోదాం పద," అంటూ షావుకారు ఇంకో కోడిని కొనే ప్రయత్నం మానేసి ఇంటికి తిరిగి వచ్చాడు.

ఆయన తన భార్యతో, "ఏమే, వీడు మన పాలేరు కాదు, యములవాడు! వీణ్ణి పనిలోకి పెట్టుకునేటప్పుడు జీతం ఏం కావాలో చెప్పమంటే, నన్నొక గుద్దుగుద్దుతానని నిన్నొక గిచ్చుగిచ్చుతాననీ అన్నాడు. వాడి సంగతి నాకేం తెలుసు? లాభసాటి బేరమేగదా అనుకున్నాను. ఇవాళ ఏం జరిగిందో తెలుసా?" అంటూ పాలేరు ఒక్క గుద్దుతో పొట్లఎద్దును చంపి, ఒక్క గిచ్చుతో దాని చర్మం సునాయాసంగా ఒలిచిన సంగతి కాస్తా చెప్పేశాడు.

"ఓ యమ్మో, ఇటువంటి వాణ్ణి ఒక్క క్షణం ఉండనివ్వరాదు! నేను చెప్పినట్టు చేస్తే వీడు విరగడ అయిపోతాడు. ఇవాళ సాయంకాలం మందను తోలుకుని ఇంటికి రాగానే, ఒక ఆవు రాలేదని వంకపెట్టి, చీకట్లో వాణ్ణి అడవికి పంపు. అక్కడ వాణ్ణి



ఏ క్రూరమృగమో పొట్టన పెట్టేసుకుంటుంది. లేకపోతే ఈ రాక్షసుడితో మనం వేగలేం!" అన్నది షావుకారు భార్య. దుర్మార్గంలో అవిడ తన మొగుడికి ఏమాత్రమూ తగ్గదు.

షావుకారుకు ఈ సలహా నచ్చింది. సూర్యాస్తమయంవేళ పాలేరు ఆవులను ఇంటికి తోలుకురాగానే ఆయన వాడితో, "అన్ని ఆవులూ ఇల్లు చేరినట్టేనా? ఒక అవు తక్కువగా కనిపిస్తుందే? తోలుకుపోయిన ఆవులు తిరిగివస్తున్నదీ లేనిదీ లెక్క చూసుకోవద్దూ?" అన్నాడు.

"లెక్కపెట్టానే? అన్నీ సరిగానే ఉన్నాయి!" అన్నాడు పాలేరు.

"సరిగా ఉండటమేమిటి? ఒక అవు అడవిలో దిగబడిపోయింది. వెంటనే వెళ్లి వెతికి పట్టుకురా!" అన్నాడు షావుకారు.

తానే పొరపడ్డాననుకుని పాలేరు చీకట్లో పడి అడవికి వెళ్లాడు. తిరగగా తిరగగా వాడికొక కొండగుహ బయట ఒక నల్లటి ఆకారం కనిపించింది.

"నువ్విక్కడ చచ్చావా? పద ఇంటికి!" అంటూ పాలేరు ఆ ఆకారాన్ని మెడ పట్టుకుని జరజరా ఇంటికి లాక్కుపోయి పశువుల కొట్టంలోకి తోసి తలుపు మూశాడు. వాడు అడవిలోనుంచి లాక్కొచ్చినది ఒక ఎలుగుబంటి. అది వాడు గమనించనేలేదు.





మర్నాడు ఉదయం షావుకారు పశువుల కొట్టం తలుపు తెరిచి లోపలికి వెళ్లి చూసే సరికి ఆవులన్నీ చచ్చిఉన్నాయి. ఒక పెద్ద ఎలుగుబంటి నిశ్చింతగా ఒకమూల పడుకుని గురకపెడుతున్నది. దానిని చూస్తూనే షావుకారు అదిరిపడి బయటికినడిచాడు.

తరవాత ఆయన గుండెలు బాదుకుంటూ పాలేరు దగ్గిరికి వెళ్ళి, "చూశావ్రా? ఎక్కడిదో ఎలుగుబంటి మన ఆవుల కొట్టం లోకి వచ్చి ఆవులన్నిటినీ చంపేసింది!" అన్నాడు ఆయాసపడుతూ.

పాలేరు వచ్చిచూసి, "నిజమేనండి! నేను రాత్రి అడవి నుంచి తెచ్చిపడేసింది ఒక వేళ ఈ ఎలుగుబంటినేనేమో! చీకట్లో పోల్చలేకపోయా!" అన్నాడు.

గుండె గుబగుబలాడుతూ షావుకారు తన భార్యదగ్గిరికి వెళ్ళి జరిగినదంతా చెప్పాడు. అంతా విని ఆ ఇల్లాలు, "వీణ్ణి పిశాచాలు పీక్కుతినా! మనకెక్కడ దాప రించాడో!" అన్నది.

"పిశాచాలంటే జ్ఞాపకంవచ్చింది! వీణ్ణి వదిలించుకోవాలంటే వీణ్ణి పిశాచాలకు వప్పగించటమే!" అంటూ షావుకారు పాలేరు దగ్గిరికి వచ్చి, "ఒరే, ఉత్తరాన మన పొలం అవతల పిశాచాల మడుగున్నది తెలుసుగా? అందులో ఉంటున్న పిశాచాలు మనకు చాలా అద్దె బాకీ ఉన్నాయి. వెళ్ళి వెంటనే వసూలుచేసుకురా!" అన్నాడు.

"అవి మనకెంత బాకీ ఉన్నాయండీ?" అని అడిగాడు పాలేరు.

"ఇచ్చినంత రాబట్టుకురా! వాటితో మనకు బేరాలేమిటి?" అన్నాడు షావుకారు.

సరేనని పాలేరు ఒక మోపు జనపనార తీసుకుని పిశాచాలమడుగు ఒడ్డుకు వెళ్లి కూచుని నారతో తాడు పేనసాగాడు.

కొంతసేపయాక ఒక పిశాచం నీటిలో నుంచి తల పైకిపెట్టి పాలేరును చూసి, "ఏం చేస్తున్నావన్నా?" అన్నది.

"కనబడటంలేదూ? మోకు పేను తున్నాను," అన్నాడు పాలేరు.

"దేనికి?" అన్నది పిశాచం.

"దేనికా? మీ పిశాచాలన్నిటినీ కట్టి పట్టుకుపోవటానికి!" అన్నాడు పాలేరు.

"మేమేం తప్పు చేశామనీ?" అన్నది పిశాచం భయంగా.

"తప్పుకాదూ? మీరు మా యజమానికి అద్దె సరిగా కట్టటంలేదుటగా?" అన్నాడు పాలేరు కోపంగా.

"కొంచెం ఉండు. మా దొరతో మాట్లాడి యిప్పుడే తిరిగి వస్తాను!" అని పిశాచం నీటిలో మునిగింది.

పాలేరు తాను పేనుతున్న తాడు రెండు చివరలూ కలిపి పెనేసి గట్టున పెట్టాడు. తరవాత ఆ దాపులనే ఒక లోతైన గుంట తవ్వాడు. అది బయటికి కనబడకుండా వుండేందుకు, దాని పైభాగంమీద కొమ్మలు పరిచాడు. వాటిపైన తన తలగుడ్డ వెల్లికిలా పెట్టి, దానికి ఒక కంత చేశాడు.

ఇదంతా అయేసరికి పిశాచం నీటిలో నుంచి తల బయటికి పెట్టి, "చూడన్నా, మేం అడుగు లేని అగాధంలో ఉంటున్నాం గదా, అలాంటప్పుడు మమ్మల్ని తాడుతో ఎట్లా అందుకుంటావని మా దొర అడుగు తున్నాడు!" అన్నది.



"ఇది మామూలు తాడనుకున్నావా? కొసలు లేని తాడు!" అంటూ పాలేరు ఆ తాటిని తన చేతులమధ్యగా తోడసాగాడు. ఎంతసేపు తోడినా తాడు వస్తూనే ఉండటం చూసి పిశాచం నిర్ఘాంతపోయి, "ఇంతకూ మేము మీకు బాకీ ఉన్నదెంతా?" అన్నది.

పాలేరు తన తలగుడ్డ చూపించి, "దీని నిండా వెండిరూపాయలు పోస్తే చాలు, మీ బాకీ తీరిపోతుంది!" అన్నాడు.

పిశాచం వెళ్ళిపోయి వెండినాణాలు తెచ్చి తలగుడ్డలో పోయసాగింది. ఎన్ని పోసినా చిల్లిలోనుంచి అడుగున గోతిలో పడుతూ ఉండటంచేత, ఎంతకూ అది నిండలేదు. బండెడు నాణాలు పోశాక తలగుడ్డ నిండింది.

"ఇంత చిన్న తలగుడ్డలో ఎంత వెండి పట్టిందో!" అని ఆశ్చర్యపడుతూ పిశాచం వెళ్ళిపోయింది. అది వెళ్ళాక వెండి యావత్తూ బండి మీద వేసుకుని పాలేరు షావుకారు వద్దకు తిరిగివచ్చాడు.

వాణ్ణీ, వాడు తెచ్చిన వెండినీ చూడగానే షావుకారుకు సంతోషం కలగటానికి మారుగా గుండె నీరైపోయింది. ఆయన తన పెళ్ళాం దగ్గిరికి పరిగెత్తి, "కొంప మునిగిందే! వీణ్ణి పిశాచాలుకూడా ఏమీ చెయ్యలేకపోయాయే! వీడి చేతిలో మనకు చావు తప్పదే!" అని శోకాలుపెట్టాడు.

"గట్టిగా అరవవద్దు. వీణ్ణి వెళ్ళగొట్టలేం గనక, అర్థరాత్రివేళ మనమే రహస్యంగా పారిపోదాం! ఆస్తి పోతే పీడాపాయిరి! బతికుంటే బలుసాకు తినవచ్చు!" అన్నది షావుకారుభార్య.

ఆ రాత్రే ఆ భార్యాభర్తలు పాలేరు నిద్రపోతున్న సమయంలో తమ ఇల్లూ వాకిలీ విడిచి పారిపోయారు. వాళ్ల ఆస్తి యావత్తూ పాలేరుది అయింది. వాడు తన తండ్రినీ అన్నలనూ తన ఇంటికి పిలిపించుకుని, పిశాచా లిచ్చిన వెండితో మరికొంత పొలం కొని సుఖంగా కాలక్షేపం చేశాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1958 జూలై సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు




★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : దినదిన గండం....

రెండవ ఫోటో : దీర్ఘాయుష్షు

పంపినవారు : అల్లంరాజు సత్యనారాయణమూర్తి,
రామారావుపేట - కాకినాడ

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




# చేపల పంట

కైరోనగరంలో గోహా అనే ప్రసిద్ధహాస్యగాడు ఒకాయన ఉండేవాడు. ఆయనకు ఒకప్పుడు తోటపనిమీద ఆసక్తి కలిగింది. అందుచేత ఆయన తన పెరడుయావత్తూ తవ్వి, రకరకాల పూలమొక్కలు నాటి పాదులుపెట్టి, ఎరువు వేసి, శ్రద్ధగా పెంచసాగాడు.

తోటపనిలో గోహాకు కలిగిన ఆసక్తి గమనించి ఆయనకు అనేకమంది మిత్రులు సలహాలిచ్చారు, చేతనయినవారు సాయం చేశారు. కొద్దికాలంలోనే గోహా తన పెరడులో అందమైన పూలు పూయించసాగాడు.

ఒకనాడు ఒక సంపన్నుడు గోహాను చూడవచ్చేసరికి గోహా తోటలో కలుపు తీస్తూ కనిపించాడు.

"ఇటీవల నువ్వు గొప్ప తోటమాలివి అయావని విన్నాను. కాని నీ తోటలో కొత్తరకం మొక్కలేమీ ఉన్నట్టు లేదే?" అన్నాడు సంపన్నుడు.

"దొరికిన విత్తనమల్లా వేసి చూస్తూనే ఉన్నాను. కొత్తమొక్కలు లేకపోతే అది నా తప్పు కాదు," అన్నాడు గోహా.

"కొత్తవిత్తనాలు కావాలంటే నేనే ఇస్తాను గాని, వాటిని మొలిపించటం నీవల్ల కాదేమోనని నా అనుమానం," అన్నాడు సంపన్నుడు.

"అటువంటి భయమేమీ వద్దు. నేను ఎలాటి విత్తనాలనైనా మొలిపిస్తాను!" అన్నాడు గోహా.

"అయితే రేపు ఉదయం మా నౌకరు చేత విత్తనాలు పంపుతాను. వాటిని మా అల్లుడు బాగ్దాదునుంచి ఇటీవల పంపాడు. నాకు తోటపనిమీద ఆసక్తి లేక వాటిని అలాగే పొట్లం కట్టిపెట్టాను," అన్నాడు సంపన్నుడు.

మర్నాడు ఉదయం సంపన్నుడి నౌకరు వచ్చి గోహాకు ఒక పొట్లం ఇచ్చి, "దీనిని

వై. ఆదినారాయణ



మా యజమాని మీకిమ్మన్నారు. వీటిని ఎంతో జాగ్రత్తగా మొలకెత్తించమన్నారు," అని చెప్పాడు.

గోహా పొట్లం విప్పి చూసి, "ఇవి ఏ బాపతు విత్తనాలో మీ యజమాని చెప్పాడా?" అని నౌకరును అడిగాడు.

"ఆయనకే తెలియదుట. మొక్కలు పెరిగాక ఆయన వచ్చి చూస్తానని చెప్పమన్నారు," అని చెప్పి నౌకరు వెళ్లిపోయాడు.

తోటపని చేసేవారు సాధారణంగా తమకు తెలియని విత్తనాలు కనిపించినప్పుడు ఒకటి నోట్లో వేసుకుని, మునిపంట కొరికి రుచి చూస్తారు. గోహాకూడా ఆ పనే చేసి సంపన్నుడు చేసిన మోసం గుర్తించాడు.

అవి విత్తనాలు కావు, ఎండబెట్టిన చేప గుడ్లు. తనను వేళాకోళం చెయ్యటానికే సంపన్నుడు వాటిని నాటమని పంపించాడు! దీనికి ఏదో విధంగా ప్రతిక్రియ చేయాలని గోహా నిశ్చయించుకున్నాడు.

రెండు వారాలు గడిచింది. గోహా బజారుకు వెళ్లిన సమయంలో సంపన్నుడు ఎదురుపడి, "ఏం, గోహా? గులాబీలు కులాసాయేనా?" అన్నాడు.

"మీ దయవల్ల ఈ యేడు అవి ఆకు కనపడకుండా పూశాయి!" అన్నాడు గోహా.



"అన్నట్టు నేను పంపిన విత్తనాలు నాటావా?" అన్నాడు సంపన్నుడు.

"అప్పుడే నాటానే!" అన్నాడు గోహా.

సంపన్నుడు నవ్వు ఆపుకుంటూ, "బహుశా మొలకెత్తి ఉండవు! వాటిని మొలకెత్తించటం మామూలు తోటమాలులకు సాధ్యమయే పనికాదని మా అల్లుడు అన్నాడులే!" అన్నాడు.

"ఆ పప్పులు మనదగ్గిర ఉడకవు. చెయ్యవలిసినట్టు పాదుచేసి, వెయ్యవలిసిన ఎరువువేసి, విత్తులునాటి జాగ్రత్తగా కాపాడితే ఏ విత్తనాలైనా మొలుస్తాయి! మీరు పంపిన విత్తనాలు ఇప్పుడిప్పుడే మొలకలెత్తు

తున్నాయి. వాటికి దిష్టి, ఎండా తగల రాదు. అందుచేత పిడతలు కప్పి ఉంచాను. రేపు ఉదయం మా యింటికి దయ చెయ్యండి, చూద్దురుగాని!" అన్నాడు గోహా.

సంపన్నుడు వెలాతెలాబోతూ, "అలాగే వస్తాను!" అని తన దారిన వెళ్లాడు.

గోహా చేపల దుకాణానికి వెళ్లి ఒక పావు శేరు చిన్నచేపలు కొని ఇంటికి పట్టుకెళ్లాడు. ఆయన తన చిన్నకొడుకును పిలిచి, "ఒరే, ఈ చేపలను మూతులు పైకి కనపడేటట్టుగా మన పెరడులో ఒక బారున సగంసగానికి పాతిపెట్టి వాటిపైన పిడతలు మూసిపెట్టు," అన్నాడు. గోహా కొడుకు అలాగే చేశాడు.

మర్నాడు ఉదయం సంపన్నుడు వచ్చాడు. గోహా ఆయనను వెంటపెట్టుకు పోయి పిడతలు చూపించి, "మొక్కలు వాటికింద ఉన్నాయి," అంటూ ఒక పిడత ఎత్తి చూపాడు. నేలలోనుంచి మొలుచుకు వస్తున్నట్టుగా చేప ఒకటి కనపడింది.

గోహా పిడతలన్నీ ఎత్తిచూపినాక సంపన్నుడికి తల తిరిగినట్టయింది. "ఆశ్చర్యం! అద్భుతం! నిన్నకూడా నీ మాటలు నేను నమ్మలేదు. ఇప్పుడైనా నా కళ్లతో ప్రత్యక్షంగా చూశాను గనక నమ్ముతున్నానుగాని లేకపోతే నమ్మను!" అన్నాడు.

"ఈ విత్తనాలు మొలిపించటం ఏమీ కష్టంకాదు. నాకే పది ఎకరాలుంటే పంట పండించేద్దును!" అన్నాడు గోహా.

"ఆ పని నేనే చేస్తాను!" అంటూ సంపన్నుడు ఇంటికి వెళ్లి తన పొలాలు చేసే వారిని పిలిచి, "ఒరే, మీరు ఈ యేడు మన పొలాలలో ఎండిన చేపగుడ్లు చల్లండి!" అన్నాడు. వాళ్లు అలాగే చేశారు.

గోహా ఈ వార్తను నగరమంతటా చెప్పేశాడు. అందరూ సంపన్నుణ్ణి చూసి నవ్వసాగారు. గోహాను పరాభవం చెయ్యబోయినందుకు తనకు ప్రాయశ్చిత్తం బాగా జరిగిందని సంపన్నుడు తెలుసుకున్నాడు.



# తూ నీ గ లు

మనం సాధారణంగా చూసే కీటకజాతులలో తూనీగలు చాలా అందమైనవి. అవి రెక్కలు పరుచుకుని ఎండలో వాలి ఉన్నప్పుడు, వాటి ఉల్లి పొరరెక్కలు వింతవింత రంగులతో ప్రకాశిస్తూంటే ఎవరికైనా ఆగి చూడ బుద్ధి అవుతుంది.

తూనీగలు కుట్టవు. అవి ఆహారం కోసం ఏ చిన్న మొక్కపైననో, పొట్టి కర్రపైననో వాలి ఉన్నప్పుడు వాటిని సులువుగా పట్టుకోవచ్చు. ఈ కారణంచేత పిల్లలు వాటిని పట్టుకుంటారు. కొందరు వాటి తోకలకు దారాలు కట్టి ఎగరవేసి ఆనందిస్తారు. కాని తూనీగలను హింసించటం చాలా తప్పు. అవి మనకు ఏ అపకారమూ చేయకపోగా, దోమలను తిని ఉపకారంకూడా చేస్తాయి.

తూనీగలలో దాదాపు రెండువేల రకాలున్నాయి. కాని అన్ని రకాలూ అన్ని దేశాలలోనూ కనిపించవు. ఒక్క అమెరికాలో 300 రకాలున్నాయట. రకాలనుబట్టి తూనీగల శరీరాలపై రంగులూ, రెక్కల రంగులూ, వాటి ప్రమాణమూ మారుతాయి. కొన్ని తూనీగలు చాలా పెద్దవిగా ఉంటాయి. వీటి రెక్కల చివరలమధ్య దూరం మూడున్నర అంగుళాలుంటుంది.

సాధారణంగా తూనీగలు ఆహారాన్ని అన్వేషించేటప్పుడు భూమికి ఆటే ఎత్తుగా ఎగరవు. కొన్నిరకాల తూనీగలు భూమిమీదనే వాలి ఉంటాయి; ఇలాటివి దారికి అడ్డంగా వాలి ఉండి, బాటవెంట యెవరైనా నడిచి





వస్తుంటే ఎగిరి పక్కకు వెళ్ళి, తిరిగి అక్కడికే వచ్చి వాలుతాయి. మరి కొన్నిరకాల తూనీగలు గాలిలో చాలా ఎత్తున ఎగురుతూ గాలిలో దొరికే ప్రాణులను తింటాయుట.



తూనీగలకు శరీరమంతటిలోకీ తల పెద్దదిగా ఉండటం మనం సులువుగా చూడవచ్చు. ఈ తలలో రెండు పెద్ద కళ్ళుంటాయి. ఒక్కొక్క పెద్ద కంటి లోనూ అనేకవేల చిన్న కళ్లుంటాయి. ఈ పెద్దకళ్లుగాక తూనీగలకు సాధారణంగా మామూలు కళ్ళలాటివికూడా వేరే ఉంటాయి. తూనీగ తన ముందరి కాళ్ళను చేతులలాగా ఉపయోగించి ఆహారాన్ని పట్టుకు తినటమేగాక, ఆ కాళ్లతో మధ్యమధ్య తన పెద్దకళ్ళను తుడుచుకుంటుంది.

రకరకాల తూనీగలు రకరకాల క్రిమి కీటకాలను తింటాయి. కొన్ని తూనీగలు ఇతర తూనీగలనుకూడా తినటం కద్దు. అయితే ఈ ఆహారం విషయంలో తూనీగలు మనిషికి ఒక విధంగా అపకారం చేస్తాయి. అది ఎలాగంటే, అవి తేనెటీగలను తింటాయి. తేనెటీగలను పెంచి తేనె పరిశ్రమ సాగించేవారు తూనీగలను శత్రువులుగా చూడటంలో ఆశ్చర్యంలేదు.

తోటలలో ఉండే తూనీకలు తమతమ స్థానాలను ఏర్పాటు చేసుకున్నాక, తమ "రాజ్యం" లోకి ఇతర తూనీగలను రానివ్వవు; వస్తే వాటితో "అహింసాయుతంగా" పోట్లాడి తరిమేస్తాయి. ఈ పోట్లాటలో విజయం ఏ విధంగా నిర్ణయమయేదీ మనం ఊహించలేం. గాలిలో రెండు తూనీగలు ఒకదానికొకటి

అభిముఖంగా ఉండి ఎగురుతూ కనిపించినట్టయితే అవి ఒకే స్థానం కోసం పోట్లాడుతున్నాయని మనం నిర్ధారణ చేసుకోవచ్చు: కొద్దిసేపట్లో "గెలిచిన' తూనీగ వచ్చి తన స్థానంలో కూచుంటుంది.

ఆడతూనీగలు తమ గుడ్లను నీటిలో వదులుతాయి. అవి నీటి అడుగున పొదిగి "జలకీటకాలు" అవుతాయి. తూనీగలలో ఎన్ని రకాలున్నాయో, జల కీటకాలలోనూ అన్ని రకాలూ ఉన్నాయి. ఇవి నీటి అడుగునే ఆహారం సంపాదించుకుని పెరిగి పెద్దవవుతాయి. కొన్ని జలకీటకాలు దాదాపు కదలవు. కదిలేవి నీటిని తమ శరీరాలలోకి తీసుకుని వత్తిడిద్వారా బయటికి తోస్తూ కదులుతాయి. (దీన్ని జెట్ ప్రొపల్షన్ అంటారు.) జలకీటకాల నాలుకలు అతి విచిత్రంగా ఉంటాయి. ఈ నాలుక కింది దవడగా ఉంటుంది, చాలా పొడవుగా ఉండి, మడుచుకోవటానికి వీలుగా ఉంటుంది. దీని చివర బలమైన కోరలలాటివి ఉండి, ఆహారాన్ని పట్టటానికి ఉపయోగిస్తాయి.

నీటి అడుగున పెరుగుతూ వచ్చిన జలకీటకం వసంతకాలంలో ఒకనాటి రాత్రి, శత్రువులెవరూ సమీపంలో లేని సమయాన, ప్రకృతి ప్రేరణచేత ఏ తుంగ కాడలనో పట్టుకుని పాకుతూ నీటి పైభాగానిగి వచ్చి నిలిచిపోతుంది. అప్పుడు దాని వీపు చీలుతుంది. అందులోనుంచి జిగురుకప్పిన రెక్కలతో తూనీగ బయటికి వస్తుంది. కొద్దిసేపటిలో జిగురు ఆరిపోతుంది. తూనీగ రెక్కలు విప్పి ఎగురుతూ తన కొత్త జీవితం ఆరంభిస్తుంది.



# చిత్రకథ





ఒకనాటి సాయంకాలం దాసూ, వాసూలు 'టైగర్' ను వెంటబెట్టుకుని, ఊరి బయటికి షికారు వెళ్ళారు. దారిలోవున్న పచ్చిక బీడులో మేస్తున్న పొటేలు ఒకటి వాళ్ళను చూసి వెంట బడింది. దాసూ, వాసూలు భయపడి పారిపో సాగారు. పొటేలు తరుముకు వస్తున్నది. అక్కడవున్న చిన్న కాలవమీది చెక్క మీదగా దాసూ, వాసూలు పరిగెత్తగానే, 'టైగర్' కూడా వాళ్ళవెంట పరి గెత్తి, తీరా పొటేలు వచ్చేసమయానికి, చెక్కను నోటితో పట్టుకుని పక్కకు లాగే సింది. పొటేలు కాలవ దాటబోయి, చెక్కతోపాటు కాలవలో పడిపోయింది.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'



# గమనించదగిన లక్షణాలు...

- కడుపు ఉబ్బరము
- అకలి మందగింపు
- చికాకు చెందడము
- విరేచనము సరిగా కాకపోవుట
- కొద్దిపాటి జ్వరము - మొదలైనవి

మీ బిడ్డ లివరు, ప్లీహము వ్యాధితో బాధపడుతూంటే కనిపించే మొదటి సూచనలు. గొప్ప అనుభవం కలిగిన జమ్మివారి సలహా తీసుకొని ఉపకారం పొందండి.

## జమ్మివారి
# లివర్‌క్యూర్

పసి బిడ్డల లివరు & ప్లీహము వ్యాధులకు

*జమ్మివారి వైద్యులు ప్రతిమాసము ముఖ్య ప్రదేశాలకు వచ్చెదరు. కార్యక్రమ పట్టికకొరకు అడగండి.*

జమ్మి వెంకటరమణయ్య & సన్స్.
హెడ్ ఆఫీసు :
మైలాపూరు, మద్రాసు-4.
బ్రాంచీలు : విజయవాడ, విజయనగరం, తిరుచ్చిరప్పల్లి, కుంభకోణం, బెంగుళూరు.

IVZ—16TG.

# ఇది నిక్కము...



...పగిలిన పాత్ర, నీటిని మంచి పాత్ర ఉంచినట్లు నిలవుంచదు, శిరోజ రంగుతో నలుపుచేయబడిన శిరోజముల నలుపు లోపూతో చేయబడినట్లుగా నిలవుండదు.

శిరోజరంగు శిరోజరములను పైపైని మాత్రమే నలుపుచేయును, లోపూ శిరోజములను సహజంగా నలుపుచేయును.




జగత్ప్రసిద్ధమైన రెండ్రు కలను సహజంగా నలుపు చేయునట్టిది.

ఎమ్. ఎమ్. ఖంబటవాలా అహమదాబాద్ 1

ఏజంట్లు :

**సి. నరోత్తమ్ అండ్ కో.,**
బొంబాయి - 2.

★

**ఢిల్లీ మెడికల్ స్టోర్సు, ఢిల్లీ.**

★

**షాహ బవిషి అండ్ కో.,**
రాధాబజార్ స్ట్రీట్, కలకత్తా.

★

**జె. బలాభాయ్ అండ్ కో.,**
నేతాజీ సుభాష్ రోడ్, మద్రాసు.

Photo by B. S. C. Sekhar



బహుమతి
పొందిన వ్యాఖ్య

దీర్ఘాయుష్మ

పంపినవారు :
ఎ. ఎస్. ఎస్. మూర్తి - కాకినాడ

